మీ పాపని
జలుబుతో
బాధపడనిస్తారా?

అక్కరలేదు..!

# విక్స్ వేపొరబ్ జలుబు భారాన్ని వెంటనే తొలగిస్తుంది ముక్కుదిబ్బడ పోగొడుతుంది. తేలిగ్గా ఊపిరి తీసుకోనిస్తుంది. పాపహాయిగా, చక్కగా నిద్రపోతుంది.

విక్స్ వేపొరబ్ ప్రత్యేకత ఏమంటే జలుబు బాధలు తీర్చ డానికి అది రెండు విధాల పనిచేస్తుంది.



బయట-చర్మం మీద



లోపల-ఊపిరి ద్వారా

1. బయట-చర్మం మీద: విక్స్ వేపొరబ్ వెచ్చదనం జలుబు వల్ల కలిగే వంటి నొప్పుల్ని తగ్గిస్తుంది.
2. లోపల-ఊపిరి ద్వారా: విక్స్ వేపొరబ్ మందు ఆవిరిగా మారుతుంది. ఊపిరి పీల్చినప్పుడల్లా ఈ మందు ఆవిరి వంట్లో ప్రవేశించి, ముక్కు-దిబ్బడను పోగొడుతుంది. గొంతు నొప్పిని, గుండెల్లో బరువుని తగ్గిస్తుంది. ఈ విధంగా మీ ..బు భారాన్ని మాయం చేస్తుంది.

ప్రత్యేక గమనిక: సత్వరం. మంచి ఫలితం కోసం, తగినంత విక్స్ వేపొరబ్ రాయండి....అంటే స్టాండర్డ్ సైజ్ (19 గ్రా. సీసా) పిల్లలకు 7, 8 సార్లు వస్తుంది: పెద్దలకు 3, 4 సార్లు.



బాగా గుణం కనబడ్డానికి ముక్కు మీద, గొంతు దగ్గర విక్స్ వేపొరబ్ రాయండి. గుండెమీద, వీపు మీద విక్స్ వేపొరబ్ బాగా రుద్దండి. జలుబు భారం పూర్తిగా తీరేవరకు విక్స్ వేపొరబ్ వాడండి.







12. గ్రాముల పెద్ద డబ్బా

రిచర్డ్‌సన్ హిందుస్థాన్ వారి ఉత్పత్తి

## విక్స్ వేపొరబ్-జలుబుబాధలకి ఆధునిక ఔషధం

ఆడపిల్లల పెండ్లి
చేయలేక బాధలు
పడే మధ్యతరగతి
కుటుంబీకుల పవిత్ర
హృదయాల గాథ.







పద్మశ్రీ-నటరత్న యన్.టి.రామారావు సమర్పించు
శ్రీవిజయ వేంకటేశ్వర ఫిలింస్

# పవిత్ర హృదయాలు

స్క్రీన్‌ప్లే-దర్శకత్వం: A.C త్రిలోక్‌చందర్  నిర్మాత: ఏ.వి.రాజు
రచన. పినిశెట్టి. పాటలు: డా. సి నారాయణరెడ్డి
సంగీతం: T. చలపతిరావు • కెమెరా: క.స.ప్రసాద్

ఆంధ్ర-సీడెడ్
జయలక్ష్మి
నైజాం:
శ్రీ వెంకటేశ్వర
మైసూరు:
సముద్రామూవీస్

# ఉత్తరాలు

### కథలు

**26—11—71** పత్రికలో ప్రచురించిన శ్రీ కోడూరి శ్రీరామమూర్తిగారు 'వైదేహీభర్త' కథలో విశ్వమూర్తిగారు గుంటూరు పోస్టుగ్రాడ్యుయేటు సెంటరులో లెక్చరర్‌గా ఉన్నట్లు రచయిత వ్రాశారు. విశ్వమూర్తి లెక్చరర్‌గా చేరిన 3 సంవత్సరములకు వెంకటనారాయణ మద్రాసులో విశ్వమూర్తికి కనపడతాడు. ఆ తరువాత నాలుగు సంవత్సరములకు విశ్వమూర్తికి వైదేహి వైజాగ్‌లో కలిసినట్లుగా వ్రాశారు రచయిత. అంటే విశ్వమూర్తి 7 సంవత్సరముల క్రితమే గుంటూరు సెంటరులో లెక్చరర్‌గా చేరినట్లవుతుంది. కానీ గుంటూరు సెంటరు స్థాపించి ఇది ఐదవ సంవత్సరము మాత్రమే కథ రాసేసమయంలో రచయితలు ఇలాంటివి గమనించం ఎంతయినా అవసరం.

వాగంటి శ్రీరామమూర్తి (గుంటూరు)

* * *

**3—12—71** పత్రికలో ప్రచురించిన ఎదురుచూసిన క్షణం కథ చాలాబాగుంది. మొత్తానికి రచయిత్రిగారు సస్పెన్స్‌లో నడిపించారు. విజయలక్ష్మిగారికి అభినందనలు తెలుపగోరుచున్నాను.

ఎస్. రామ్‌కుమార్ (ఆదోని)

* * *

**3—12—71** తేదీ ఆంధ్రసచిత్రవారపత్రికలో శ్రీభాగవతుల విజయలక్ష్మి వ్రాసినకథ (ఎదురుచూచిన క్షణం) నాకెంతో నచ్చింది. రచయిత్రికి నా ధన్యవాదములు. శర్మ, వి. యస్. యస్. (ధూళిపూడి)

### సీరియల్

క్రొత్తగా మొదలయిన సీరియల్ సెల్మాతో ప్రేమయాత్రలో భార్యాభర్తల కీచులాటలు సహజంగా వున్నాయి. పాపం, ప్రయాణానికి అంతా సిద్ధం చేసుకున్న తరువాత బాబిగాడు చేసిన పని తెలిసి నేను నవ్వును ఆపుకోలేకపోయాను.

సి. హెచ్. సనత్‌కుమార్ (కరీంనగర్)

### ముగ్గురు మూర్ఖులు

మహేష్‌గారి ముగ్గురుమూర్ఖులు శీర్షికలలో రాజకీయాలు, ఇటు వివిధ విషయాలు విమర్శలు పాఠకులకు పనసతొన వలచినోటిలో పెట్టినట్లు అందజేస్తున్నారు. మహేష్‌గారికి నా అభినందనాలు. నిమ్మల వెంకటరెడ్డి (పిఠాపురం)

మధ్యంతర ఎన్నికలలో కొత్త కాంగ్రెసు సాధించిన అఖండ విజయాన్ని పురస్కరించుకొని ఫిబ్రవరి **1971** చివరి వరకు ప్రచురింపబడిన శ్రీ మహేష్ గారి ముగ్గురుమూర్ఖులు నిలుపుదల మనందరకు తెలిసిన విషయమే. తే. **19—11—71** ఆంధ్ర సచిత్రవారపత్రికలో మహేష్‌గారి మొదటికథ విమర్శను ప్రచురించి సంపాదకులు మళ్ళీమొదలుపెట్టేరని నేను భావిస్తున్నాను.

వి. సూర్యప్రకాశరావు (అనకాపల్లి)

### మీకు తెలుసా?

మీకు తెలుసా శీర్షికలో ఎప్పుడు చదివినా నటి భారతికి బిస్కట్లు యిష్టము, వాణిశ్రీ వంట చేస్తుంది అనే విషయాలతో బోర్ కొట్టించిన మాకు 3—12—71 సంచికలో ప్రసిద్ధ సినీ నటుల ఇంకంటాక్స్ బకాయిలు తెల్పినందుకు చాలా సంతోషం. బకాయిలు పడిన వారిలో మన తెలుగు నటీనటులు లేకపోవడము ఇంకా సంతోషము.

జి. మోహన్‌రావ్, (విజయనగరం.)

### రాజధాని కబుర్లు

రాష్ట్రంలో దంతవైద్యుల సమస్యల గురించి వాస్తవికతను ప్రచురించినందుకు కృతజ్ఞతలు. బ్రహ్మానందరెడ్డిగారు అన్నట్లు లా గ్రాడ్యుయేట్లందరు తమకు చేతినిండా పని తగలడానికి కోర్టుల

విభజ్య చేయమని కోరితే చేయగలమా అని చెప్పి వతను మరికొందరు సభ్యులకు చేతినిండా పని ఉన్నందుకా లేక వారి జీవనోపాధి మెరుగుపరుచుటకా 8 మంది సభ్యులుగల మంత్రివర్గంను 28 వరకు చేసినది. అర్థం కావటంలేదు.

ఒక్క మంత్రిని తగ్గించిన యెడల ఎంతమందికి ఉద్యోగావకాశాలు కలుగునో బహుశ ఆయనకు ఆలోచన వచ్చి ఉండదు.

శ్రీ వాగేశ్వరరావు గారు వ్రాసినట్లు దంత వైద్యుల కోర్సు 4 సం.లు కాక 5 సం.లు గల కోర్సు.

ఇప్పటికైనా దంతవైద్యుల సమస్యలు ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తుందని ఆశించుదాము.

పలగాని శ్రీనివాసులురెడ్డి, 3వ బి.డి.ఎస్.
(హైదరాబాదు)

## ఒకవారం విపరీతం

అయ్యో! ఢిల్లీ బి. కమలాకరరావుగారూ, మీ వుత్తరం సాంతం శ్రద్ధగా చదివాను. నిజంగా ఒక ప్రభుత్వోద్యోగిని ఒక పెద్దమనిషికొట్టారంటే అది సరదా కలిగించే విషయం కానేకాదు. ఆ గార్డు ఎంత త్రాగివున్నా, శ్రీ జాంబవంతరావు ధోటే కొట్టడం పబబు కాదని అంటే ఎవరైనా ఒప్పుకుంటారు. ఈనాడు, యీ నాడేకాదు ఏ నాడుకూడా సభ్యత, సంస్కారమూ తెలిసిన వ్యక్తి మరో వ్యక్తిని కొట్టడం అనాగరికమే గాక, అసభ్యమని కూడా అంటే తప్పు కోసు. ఏది ఏమైనా మీ పెద్ద ఉత్తరం ద్వారా 1965వ సంవత్సరంలో శ్రీ ధోటే వో మంత్రి మీద పేపర్‌వెయిట్ విసిరిన విషయం కూడా తెలిసింది. జరిగిన విషయాన్ని పాఠకులకు తెలియ రాయటమే గాని, శ్రీ జాంబవంతరావు ధోటే మీద నాకు ఏ విధమైన పగ, కసి లేవని మాత్రం మీకు హామీ యివ్వగలను. ఆనాటి ఆవార్త అదే ధోరణిలో చాలా పత్రికలు కూడా వ్రాశాయి.

(పాలాక్షుడు)

## బంగ్లాదేశ్

బంగ్లాదేశ్ శరణార్థుల సహాయార్థం పై జరుగుతున్న వాగ్వివాదాలు ప్రతీవారం చదువుతునే యున్నాము. శరణార్థులకు సహాయం చేయాలని కొందరు, సహాయం అనవసరమని కొందరు భావిస్తున్నారు.

శరణార్థులకు ఎందుకు సహాయం చేయకూడదు? మానవులమై పుట్టినందుకు ఒక్క క్షణం మానవులుగా ప్రవర్తించాలి. అందుకు సాటిమానవుని ఆపదలో ఆదుకోవాలి. కాని అది తలకు మించిన బరువు కాకూడదు. చాలామంది యిది భారతదేశానికి తలకుమించిన బరువే అని అపోహపడుతున్నారు. కాని అది ఎంతమాత్రమూ నిజంకాదు. శుద్ధ అబద్ధము. మన దేశంలో డబ్బు లేకపోలేదు. ధనిక వర్గాలచేతుల్లోంచి బయటపడలేక బిగిసిపోతుంది. వీళ్ళ చేతుల్లోంచి డబ్బును పన్నుల రూపంలో గుంజితే మనం ఎవరికైనా, ఏ విధంగానైనా సహాయం చేయగలం.

# ఉత్తరాలు

కాని మన ప్రభుత్వం యిందుకు భిన్నంగా వ్యవహరిస్తోంది. అందుకే చాలామంది బాంగ్లాశరణార్థులకు సహాయం చెయ్యవద్దని, ప్రార్థిస్తున్నారు. ధనికవర్గాల నుంచి మన ప్రభుత్వానికి పన్నుల రూపంలో కోట్లకొలది రూపాయలు బకాయిలు ఉన్నాయి. అవి వసూలు చేసినా మనకి లోటుండదు. మన ప్రభుత్వానికి సాటి మానవుడిపై మనస్ఫూర్తిగా సానుభూతి ఉంటే, ఎక్కిన గద్దె దిగకుండా ఉండాలంటే ధనిక వర్గాల నుంచి పన్నులు వసూలు చేయమనండి. అంతేకాని ఆకలితో అలమటించి పన్నుల భారం మోయలేక కృంగికృశించి పోతున్న సామాన్య, మధ్య తరగతి వాళ్ళపై యింకా బరువు వేయటం ఎందుకు? ఏ సోషలిజం పేరుతో గద్దె ఎక్కారో ఆ సోషలిజం కోసం ప్రయత్నించమనండి. అయినవాళ్ళు చేస్తే ఒప్పు, కానివాళ్ళు చేస్తే తప్పు అన్న పక్షపాతవైఖరి మన ప్రభుత్వానికి ఉన్నంత కాలం మనం ఏ విధంగానూ వాగ్వివాదాలు జరపటం అనవసరం. సోదరులు నాయందు దయయుంచి నా యీ సూచనను అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

గుండారపు ప్రభాకరరావు, (పిఠాపురం)

* * *

26—11—71 సంచికలో ఎమ్. వి. కమలాకరరావుగారి ఉత్తరం చూచి నవ్వాలో, ఏడ్వాలో అర్థం గాలేదు. తాము ఎంతటి క్షామపరిస్థితులలో వున్నప్పటికీ, ఇతరులు కష్టపడుతుంటే ఆదుకోనడం భారతీయుల అవున్నత్యమన్నారు. అలా ఆదుకుంటూ రావడం వలననే, నేడు మన దేశమీ అధోగతిలో వుంది.

మన ప్రభుత్వ మనుసరిస్తున్న విదేశాంగ విధానం వలన, ప్రపంచంలో ఎవరూ మన మాట నమ్మటం లేదు. సిలోన్‌లోని నా స్నేహితులొకరు ఇప్పటికీ, బంగ్లాదేశ్ ఉద్యమాన్ని భారతదేశమే ప్రారంభింపచేసిందని. భారతదేశం ఈ శరణార్థుల భారం మోయటంలో ఏదో గూడు పుఠాణి వుందని భావిస్తున్నారు. అంతేకానీ, మన విశాలహృదయాన్ని అర్థం చేసికొనేంతటి విశాలహృదయం ప్రపంచంలో ఏ దేశస్థులకు లేదు.

ముందు మన సంగతే అనుకుంటే, మన దేశాభివృద్ధి నశించి, మన ఏకమత్యానికి భంగం వాటిల్లుతుందనడం పట్టి హాస్యాస్పదం. ప్రజలలో ప్రాంతీయాభిమానాలు అధికమై, ప్రత్యేకరాష్ట్రాలు కావాలని కోరడానికి కారణం, కొన్ని ప్రాంతాలు అభివృద్ధి చెంది కొన్ని అభివృద్ధి చెందక పోవటమే. శరణార్థులకుఖర్చుపెట్టే ధనంలో నాలుగోవంతు ఖర్చుపెట్టి దేశంలో పరిశ్రమల నభివృద్ధి చేస్తే నిరుద్యోగ సమస్యతీరుతుంది. ప్రాంతీయ విభేధాలురావు. ప్రభుత్వానికి లాభదాయకంగా వుంటుంది.

కాబట్టి, ఇప్పటికైనా శరణార్థులను పాకిస్తాన్ పంపించి వేయటం మంచిది. తనకు మాలినధర్మం, మొదలు చెడ్డబేరం పనికిరాదు.

పాతపల్లి సత్యనారాయణ, (కడప)


# ఆంధ్రసచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం 17–12–'71
శ్రీ విరోధికృన్నామ సం॥ మార్గశిరమాసం శు॥ అమా॥

సంపుటము: 6౯ సంచిక: 17

స్థాపితము:
1908

ముఖ్య సంపాదకుడు:
శివలెంక శంభుప్రసాద్

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీథి, మద్రాసు - 1

విడి ప్రతి వెల 50 పైసలు

పోస్టుద్వారా

| | |
|---|---|
| సంవత్సర చందా | 31·20 |
| 6 మాసముల చందా | 15·60 |
| 3 మాసముల చందా | 7·80 |


## విషయానుక్రమణిక

ముఖచిత్రం; నటి వాణిశ్రీ

మహారాజులు-పాత,కొత్త




అధికార వర్గం నాయకత్వం


ఉద్యోగి వర్గం
౨౪వ సవరణ ఆమోదం
ఇది మన అధికారాన్ని మరింతగా పెంచుతుంది


వర్షంలో ఈగొడుగు నాకు ఉపయోగిస్తుందా!
తగ్గిపోయిన ప్రాథమిక హక్కులు
ప్రజలు


వాళ్ళతగాదాల వల్ల నేను లాభం పొందవచ్చు


ఇండియా
పాకిస్తాన్
OOMMEN

# అస్తవ్యస్తంగా ఉన్న రాష్ట్ర కాంగ్రెస్ వ్యవస్థ

ప్రధానమంత్రి, తదితర కాంగ్రెస్‌అగ్రనాయకులు మొత్తంమీద ఏకారణం చేతనైతేనేమి, మన రాష్ట్రంలో కొంత కాలంగా స్థిరపడి పోయిన రాజకీయ నాయకత్వాన్ని అధికారం నుంచి తప్పించారు. రాష్ట్ర కాంగ్రెస్ శాసనసభా పార్టీ నాయకత్వంలో మార్పు ప్రవేశ పెట్టారు. ప్రదేశ్ కాంగ్రెసు సంఘాన్ని రద్దుచేసి, బ్రహ్మానందరెడ్డి వర్గం చేతుల్లో నున్నటువంటి బలమైన ఈ ఆయుధాన్ని కూడా తొలగించారు. ఈ రెండు చర్యలు ఢిల్లీలోని కాంగ్రెసు అధినాయకులు తీసుకున్నటువంటివే. ఉన్న నాయకత్వాన్ని తొలగించడమైతే జరిగింది కాని దాని స్థానే మరో నాయకత్వప్రతిష్ఠ ఇంతవరకు జరిగినట్లు కనిపించదు.

కాంగ్రెస్ పార్టీ సంపూర్ణ మద్దతుతో, పార్టీ నాయకుడుగాను, ముఖ్యమంత్రిగాను పాములపర్తి వెంకట నరసింహారావుగారు వ్యవహరిస్తున్న మాట నిజమే. కాని గురుతరమైన బాధ్యతలు కల ఈ పదవిని వహించినంత మాత్రాన నరసింహారావుగారే బ్రహ్మానందరెడ్డిగారి స్థానంలో శాసనసభా పార్టీ కి, ప్రదేశ్ కాంగ్రెసుకు నాయకత్వం చేపట్టారనడానికి ఇంత వరకు ఆధారాలు కనిపించడం లేదంటే అతిశయోక్తి కాదు. అసలు నరసింహారావు గారే తమను, రాష్ట్ర నాయకుడుగా భావించుకుంటున్నారా అని కూడా ప్రశ్నించుకోవలసిన స్థితి ఏర్పడింది.

బ్రహ్మానందరెడ్డిగారు ఎంత సమర్థులైన నాయకులైనప్పటికీ ఆయన అండన నిలచిన వారంతా హృదయపూర్వకంగాను, చిత్తశుద్ధి తోను ఆయన్ను నాయకుడుగా స్వీకరించి అనుసరించారనడానికి వీల్లేదు. పత్రిక్లు, రాజకీయ మనుగడావసరం, ఇలాంటి కారణాలెన్నింటి మూలంగానో బ్రహ్మానందరెడ్డిగారి రాజకీయ ప్రాబల్యం స్థిరత్వాన్ని పొందింది. కనీసం పొందినట్లుగా కనిపించింది. కాని ఆయన ముఖ్యమంత్రి పదవి నుంచి వైదొలగవలసి రావడంతో, ఆయనకు చాలా సన్నిహితులుగా నున్నవారు ఆయన మూలంగా రాజకీయ పెత్తనాన్ని పలుకుబడిని పొందిన వారు మినహా మిగతా వారు పలువురు కొత్త నాయకత్వం కోసం, అన్వేషిస్తున్నారు. వారికి నరసింహారావుగారి ననుసరించడానికి అభ్యంతర ముండదు కాని తమకు ఒక అనుచర వర్గాన్ని సృష్టించుకొనడం నరసింహారావు గారికి ఇష్టంగా కనిపించడం లేదు.

## ఒకవర్గంలో అసంతృప్తి

తన మంత్రివర్గంలో బ్రహ్మానందరెడ్డి వర్గానికి చెందిన ముఖ్యులను చేర్చుకొనక, ఆ వర్గం ఆగ్రహానికి నరసింహారావు గారు గురియైనారు. తన మంత్రివర్గంలో చేర్చుకున్న వారందరినీ, వారి వారి బలగంతో సహా కూడగట్టుకొనే ప్రయత్నమూ చేయక, వీరిలో అసంతృప్తికి కూడా ఆయన కారణభూతులయ్యారు.

## ప్రదేశ్ కాంగ్రెస్ పునర్నిర్మాణంలో జాప్యం

ప్రదేశ్‌కాంగ్రెసుకు తాత్కాలిక సంఘాన్ని ఏర్పాటు చేయడంలో జరుగుతున్న జాప్యం, నరసింహారావు గారి రాజకీయ ప్రతిష్ఠకు చాలా భంగకరంగా పరిణమించింది. ప్రదేశ్‌కాంగ్రెసును రద్దు చేసిన వారు పార్టీ అగ్రనాయకులు. దాని పునర్నిర్మాణం చేయవలసినదికూడా వారే. కాని కాంగ్రెసు అధ్యక్షుడు సంజీవయ్యగారికి, నరసింహారావు గారికీ మధ్య విభేదాల కారణంగానే ఈ విషయమై ఏ నిర్ణయమూ జరగడం లేదని తెలుస్తున్నది. ఈ లేఖ వెలువడే నాటికి తాత్కాలిక కాంగ్రెస్ సంఘ నియామకానికి సంబంధించిన ప్రకటన ఢిల్లీ నుంచి వెలువడవచ్చును. కాని ఈ సందర్భంలో జరిగిన జాప్యం మూలంగా కలుగవలసిన హాని కలిగిపోయింది. రాష్ట్రంలో నాయకత్వం ఎవరిదో ప్రస్ఫుటం కాకుండా పోయింది. బ్రహ్మానందరెడ్డి గారితో ఉండదలచుకొనని వారు ఎవరి ననుసరించాలో తేల్చుకొన లేకుండా ఉన్నారు. ఇందుకు విరుద్ధంగా బ్రహ్మానందరెడ్డి గారినే మొదటి నుంచీ నమ్ముకొని ఉన్నవారు నమ్మైక్యమై 1972 శాసనసభా ఎన్నికలు జరిగిన తరువాత అధికారాన్ని మళ్ళీ చేజిక్కించుకొనడానికిసంసిద్ధులవుతున్నారు.

## కొత్త నినాదం!

రాష్ట్ర యువజన కాంగ్రెసు పూర్తిగా బ్రహ్మానందరెడ్డి వర్గం ప్రాబల్యంలో ఉంది. ఆ విధంగానే యువకాంగ్రెసు శాసనసభ్యుల ఫోరం కూడా. ప్రతిపక్ష కాంగ్రెసుకు చెందిన వారిని అధికార కాంగ్రెసులో చేర్చుకొనడానికి ఈ యువ కాంగ్రెసువాదులు తీవ్రంగా వ్యతిరేకించారు. ఇందుకు, బ్రహ్మానందరెడ్డిగారు కూడా వ్యతిరేకులేనన్న విషయం అందరికీ తెలిసిందే. ఈ యువ కాంగ్రెసువాదు లిప్పుడు మరో కొత్త నినాదం ప్రారంభించారు. వీరికి హటాత్తుగా కాంగ్రెసులో, రాష్ట్ర ప్రజాజీవనంలో కులతత్వం చెలరేగుతున్నట్లు కనిపిస్తున్నదట. పార్టీ టికెట్లు ఇచ్చేటప్పుడు ఈ విషయాన్ని దృష్టిలో పెట్టుకోవాలట. ఇంత కాలం అధికారంలో నున్నది, అధికారం ద్వారా పలుకుబడి ప్రయోజనమూ పొందిందీ ఈవర్గమే. కాని ఈ రోజుల్లోనే వీరికి కులతత్వం ప్రజ్వరిల్లినట్టు కనిపించడం వింతగానే కనిపిస్తున్నది. కాని అసలు విషయం అందరికీ తెలిసిందే. రాష్ట్ర కాంగ్రెసు నాయకత్వంలో మార్పు వీరికి అంగీకారయోగ్యంగా లేదు.

అంతా సవ్యంగా జరిగితే, శాసనసభా ఎన్నికలు వచ్చే ఫిబ్రవరిలో జరుగుతాయి. కాని ఎన్నికల ముందు కాంగ్రెసు వ్యవస్థ మన రాష్ట్రంలో ఇలా అస్తవ్యస్తంగా ఉంది. ఇందుకు ప్రధాన బాధ్యత ఢిల్లీలో నున్న కాంగ్రెసు అగ్రనాయకులదే ననడంలో సందేహం లేదు. రాష్ట్ర నాయకత్వంలో మార్పు తెచ్చింది వారు. నరసింహారావు గారిని పార్టీ నాయకుడుగా ముఖ్యమంత్రిగా ప్రతిష్ఠించింది వారు. ప్రదేశ్‌కాంగ్రెసు పునర్వ్యవస్థీకరణలాంటి విషయాల్లో ముఖ్యమంత్రికి నచ్చచెప్పి తమ అభీష్టాన్ని నెరవేర్చుకొనడమో లేక ఆయన అభీష్టాన్ని, అవసరాలను గమనించి తదనుగుణంగా నిర్ణయాలు తీసుకొని తోడ్పడమో చేయవలసిన

[ఈ సంచిక తయారవుతున్న సమయానికి పశ్చిమ పాకిస్తాన్ భారత దేశంమీద యుద్ధం ప్రకటించింది. మనదేశంమీద పాకిస్తాన్ విమానాలు బాంబులు వేశాయి. ఆత్మ సంరక్షణ కోసం భారతదేశం ప్రతీకార చర్యలు కొన్ని తీసుకోవలసి వచ్చింది. మన సేనలు బంగ్లాదేశ్ లోనికి వెళ్లి అక్కడ ఉంటున్న పశ్చిమ పాకిస్తాన్ స్థావరాలమీద కొన్నిచర్యలు తీసుకొంటున్నాయి. దేశంలో అత్యవసర పరిస్థితి నెలకొల్పటంకూడా జరిగింది. ఇది భారతదేశం ఎదుర్కొంటున్న క్లిష్టపరిస్థితులలో అత్యంత ప్రమాదకరమయినదే కాని మనసేనలు తమ కర్తవ్యాన్ని సునాయాసంగా నెరవేర్చ గలవని అందరికీ తెలుసు. దేశప్రజలు కూడా ఎప్పటివలే సమైక్యతతో వ్యవహరిస్తారని కూడా అందరికీ తెలుసు. సం.]

సాధ్యత కూడా వారిదే.

**అసంతృప్తిగా ఉన్న ఆర్థికపరిస్థితి**

మన రాష్ట్ర ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి ఏమాత్రం సంతృప్తికరంగా లేని విషయం అందరికీ తెలిసిందే. నిజానికి ప్రస్తుతం ఏమాత్రమైనా అభివృద్ధి పనులు కొనసాగుతున్నాయంటే, అవి కేంద్రం సహాయంతో లేక కేంద్రం రూపొందించి అమలు చేస్తున్న పథకాల ద్వారానే జరుగుతున్నాయనడం అతిశయోక్తి కాదు. ఈ వారం సమాప్తమైన రాష్ట్ర శాసనసభా శీతాకాల సమావేశంలో ప్రభుత్వం ప్రవేశపెట్టిన బడ్జెటు ఉపప్రతిపాదనలు ఈ విషయాన్ని చెప్పక చెబుతున్నాయి. మొత్తం ఎనిమిది కోట్ల పైచిలుకు అదనపు ఖర్చులో రు. 71 లక్షలు మాత్రమే రాష్ట్ర ప్రభుత్వపు నిధులకు చెందినవి. మిగతా సొమ్మంతా కేంద్రం తాను తలపెట్టి అమలు చేస్తున్న పథకాలకు సంబంధించినది. ఒక రకంగా నరసింహారావు గారికి లభించింది ఖాళీ బొక్కసమే కాక ఖాళీ ధాన్యాగారాలు కూడా. ఇప్పటికి మూడు సంవత్సరాలుగా మనరాష్ట్రం ఏదో ఒక నైసర్గిక విపత్తుకు గురి అవుతూ ఉంది. నిరుడు అతివృష్టి, తుఫానులు సంభవిస్తే ఈ సంవత్సరం అనావృష్టి, పంటల నష్టం. ఐనా బ్రహ్మానందరెడ్డి గారి ప్రభుత్వం బియ్యం రవాణాను కొనసాగనిచ్చింది. ప్రభుత్వం మూడు లక్షల టన్నుల బియ్యం ఎగుమతికి అనుమతులు ఇస్తే, వాస్తవంగా ఇతర రాష్ట్రాలకు రవాణా జరిగిపోయినవి, అంతకు రెండింతలు. రవాణా జరిగిన ప్రతి బస్తా పైన రు. 4 చొప్పున పార్టీ నిధి పేర వసూలు జరిగిందట. ఆ డబ్బు ఎంతో, ఏమైందో, ఏవిధంగా ఎవరిచేత వినియోగం జరుగుతుందో తెలియదు కాని మన రాష్ట్రంలోని ధాన్యాగారాలన్నీ నిండుకున్నాయి. మహారాష్ట్ర నుంచో, మధ్యప్రదేశ్ నుంచో ధాన్యం తెప్పించుకోవలసిన స్థితి ఏర్పడింది. వచ్చే ఐదారు వారాలు ఎట్లా గడుస్తాయా అని కొత్త సివిల్ సప్లైస్ మంత్రి పిల్లా సుబ్బారాయుడుగారు కలవరపడుతున్నారు.

—వి. నాగేశ్వరరావు

**అవీ...ఇవీ:**

**విజయవాడలో**

**'ఘోష' నాటిక ప్రదర్శన**

నెహ్రూ జన్మదినం సందర్భంగా నవంబరు 14న రైల్వే ఇన్‌స్టిట్యూట్ డ్రమెటిక్ క్లబ్‌వారు విజయవాడ రైల్వే ఇన్‌స్టిట్యూట్ హాలులో శ్రీ బీసెట్టి లక్ష్మణరావు రాసిన ఘోష నాటకాన్ని ప్రదర్శించారు. ఇందులో శ్రీయుతులు వి. రఘురామయ్య, వై. సూర్యనారాయణ, ఇ. తాడయ్య, పి. కామరాజు, పిచ్చయ్యరాజు, జె. వి. రమణరాజు, కుమారి కె. సుజాత నటించారు. దర్శకుడు శ్రీ తేకిరాజు జగన్నాథరావు. సంగీతం శ్రీ వేపా అండ్ పార్టీ వారు సమకూర్చారు.

(ఓ. వి.)













# బ్రహ్మచారి కొడుకు

'మనదేశంలో యిక యెన్నికలు జరపడం అనవసరం' అన్నాడు చిదంబరం.

'ఎందుచేత?' అని ప్రశ్నించాడు చంచలావు.

'ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చెప్పిన మాటలను విన్న తరువాత యెవరైనాసరే, యెన్నికలు జరపడం అనవసరం అని అనుకోక తప్పదు.'

'ముఖ్యమంత్రి చెప్పిన మాటలు యేమిటి?'

'1971వ సంవత్సరం నవంబరు 21వ తేదీని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి పి వి. నరసింహారావు హైద్రాబాదులో పత్రికా విలేఖరులతో అన్న మాటలు యివి' అని అంటూ చిదంబరం చెప్పడం ప్రారంభించాడు.

'రేపు యెన్నికలుపెట్టినా, కాంగ్రెసు పక్షానికి అఖండమైన విజయం రావడం ఖాయం. 55 కోట్ల భారతీయులలో ఇతర పక్షాలకు చెందినవారు ఏకొద్దిమందోతప్ప మిగతావారందరి హృదయం కాంగ్రెసుకే అంకితమై ఉన్నది.

రేపు ఉదయం ఒక డబ్బాపెట్టి, మీ వోటు యెవరికివేస్తారో, వేయండి అని ప్రజలను అడిగితే, కాంగ్రెసు అభ్యర్థులనే గెలిపిస్తారు. ప్రజాహృదయం కాంగ్రెసుకు అలా అంకితం అయిపోయింది. కాంగ్రెసు అధికారంలో ఉన్నది కనుక అలా జరుగుతున్నదని మీరు అనవచ్చు. కమ్యూనిస్టులు, స్వతంత్రపక్షంవారు, అకాలీలు కూడా రాజ్యంచేసిన రాష్ట్రాలు ఉన్నాయి. కాంగ్రెసుకు పడినట్లు వోట్లు మిగతా పార్టీలకు ఎందుకు పడవు? అక్కడే ఉన్నది కాంగ్రెసుపార్టీయెక్క గొప్పతనం...'

ముఖ్యమంత్రి పైన చెప్పినట్లుగా 55 కోట్ల భారతీయుల్లో యే కొద్దిమందో తప్ప మిగిలినవారందరి హృదయం కాంగ్రెసుకే అంకితం అయినప్పుడు, కొన్ని కోట్ల రూపాయలు ఖర్చుచేసి యెన్నికలు జరపడం యెందుకు? మిగిలినపక్షాలవారు యెన్నికల్లో పోటీచెయ్యడం యెందుకు? ఆ వోట్లను లెక్కపెట్టడం యెందుకు? ఇదంతా దండుగేకదా! కాంగ్రెసుపార్టీ నిర్ణయించిన అభ్యర్థులందరూ నేరుగా శాసనసభలోనికే వెళ్లిపోవచ్చును. అప్పుడు దేశానికి ఖర్చూ, ప్రజలకు శ్రమాకూడా తప్పుతాయి' అన్నాడు చిదంబరం.

'ముఖ్యమంత్రి చెప్పినమాటలు వినగానే యిదివరకు ఒక బ్రహ్మచారి చెప్పిన మాటలు నాకు గుర్తుకువచ్చాయి' అన్నాడు చూడామణి.

'ఏమిటి ఆ బ్రహ్మచారి మాటలు?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక ఊళ్లో ఒక బ్రహ్మచారి ఉన్నాడు.

'ఎందుకు బ్రహ్మచారిగా ఉండిపోయావు?' అని ఒక స్నేహితుడు ఒకప్పుడు ఆ బ్రహ్మచారిని ప్రశ్నించాడు.

'మా తాత బ్రహ్మచారి. మా తండ్రి బ్రహ్మచారి. అందుచేత నేనుకూడా బ్రహ్మచారిగా ఉండిపోయాను,'

'మీ తాత బ్రహ్మచారి అయితే మీ తండ్రి యెలాగ పుట్టాడు? మీ తండ్రి బ్రహ్మచారి అయితే నువ్వు యెలాగ పుట్టావు? అని ఆ స్నేహితుడు బ్రహ్మచారిని తిరిగి ప్రశ్నించాడు.

దిట్టమైన కట్టడాలు: నగర ప్రాంతం-2









తక్కువ ఖరీదు
బస్తీ ఇల్లు

గట్టితనానికి, మన్నికకు, ఆపైన పొదుపుకు అనన్యమైనది

# శంకర్ సిమెంట్




పర్వతంలాంటి శాశ్వతమైన నిర్మాణానికి సాటి
ఐ.ఎస్.ఐ ప్రమాణ చిహ్నంచే పూచీ ఇవ్వబడింది




FDSIC-1444TE

ఇండియా సిమెంట్స్ లిమిటెడ్, ధన్ బిల్డింగ్, మద్రాసు-2
23 ఏండ్ల పైబడి పేరు పొందినది — ఇంకను విస్తరిల్లుచున్నది.
ఉచిత సాంకేతిక సలహాలకు ఈ క్రిందివారికి వ్రాయండి: సిమెంట్ సర్వీస్ బ్యూరో, 'దిగ్రేవ్', మద్రాసు-18

ఆ ప్రశ్నకు సమాధానం యేమని చెప్పాలో తెలియక బ్రహ్మచారి తెల్లమొగం వేశాడు' అని బ్రహ్మచారి చెప్పిన మాట విను చూడామణికి వివరించాడు.

'నువ్వు చెప్పిన దానినిబట్టి ఆ బ్రహ్మచారియొక్క తెలివితక్కువతనం రుజావు అవుతున్నది. కాని ముఖ్యమంత్రి చెప్పిన మాటలు వినగానే ఆ బ్రహ్మచారి మాటలు నీకు 'యెందుకు గుర్తుకు వచ్చాయి?' అని తిరిగి ప్రశ్నించాడు చిదంబరం.

'55 కోట్ల భారతీయులలో యితర పక్షాలకు చెందినవారు యే కొద్దిమందో తప్ప మిగతావారందరి హృదయం కాంగ్రెసుకే అంకితమై ఉన్నది' అని అంటూనే ముఖ్యమంత్రి—కమ్యూనిస్టులు, స్వతంత్ర పక్షంవారు, అకాలీలుకూడా రాజ్యంచేసిన రాష్ట్రాలు ఉన్నాయి, అని అంగీకరించారు.

ఇతరపక్షాలకు చెందినవారు యేకొద్దిమందో తప్ప 55 కోట్ల భారతీయుల హృదయం కాంగ్రెసుకే అంకితమైపోయి ఉన్నట్లయితే అసలు యీ కమ్యూనిస్టులు స్వతంత్ర పక్షంవారు అకాలీలు కొన్ని రాష్ట్రాల్లో మాత్రం యెలాగ అధికారంలోనికి రాగలిగారు ముఖ్యమంత్రిగారూ? అని యెవరైనా ప్రశ్నవేసినట్లయితే ముఖ్యమంత్రికూడా ఆ బ్రహ్మచారివలెనే తెల్లమొగం వేయవలసి వస్తుందికాదా?' అని ప్రశ్నించాడు చూడామణి.

# మంగుతు మహర్షులు

'మొత్తం భారతదేశాన్ని గురించి ముఖ్యమంత్రి అలాగ చెప్పడం సరియైనదికాదు' అని వాదంకోసం అంగీకరిద్దాం. లోకసభకు జరిగిన మధ్యంతర యెన్నికల్లో ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసు పక్షానికి అత్యధిక సంఖ్యాబలం వచ్చింది కదా! అందుచేత ముఖ్యమంత్రి ఆంధ్రప్రదేశ్‌ను గురించే అలాగ చెప్పి ఉండవచ్చును. దానికి నువ్వు యేమిటి అంటావు?' అని తిరిగి ప్రశ్నించాడు చంద్రరావు.

'55 కోట్ల భారతీయుల హృదయం' అని ముఖ్యమంత్రి స్పష్టంగా చెప్పడం వలన ఆ మాటలు మొత్తం భారతదేశాన్ని గురించి చెప్పినవేకాని కేవలం ఆంధ్రప్రదేశ్‌ను గురించి చెప్పినవికావు' అని మనం నిశ్చితంగా ఊహించవచ్చు. నువ్వు చెప్పినట్లుగా ముఖ్యమంత్రి కేవలం ఆంధ్రప్రదేశ్ గురించే పై మాటలు చెప్పినట్లయితే, ముఖ్యమంత్రికి దేశం జనాభా యెంతో, రాష్ట్రం జనాభా యెంతోకూడా తెలియదు, అని మనం అనుకోవలసి ఉంటుంది' అన్నాడు చూడామణి.

'ముఖ్యమంత్రి మొత్తం భారతదేశాన్ని గురించే అలాగ చెప్పి ఉండవచ్చును అని అనుకొందాం. లోకసభకు జరిగిన మధ్యంతర యెన్నికల్లో దేశం మొత్తంమీద కాంగ్రెసు పక్షానికి అత్యధిక సంఖ్యాబలం వచ్చింది: కమ్యూనిస్టులు వగైరా ప్రతిపక్షాలు అంతకుముందు జరిగిన యెన్నికల్లో అధికారంలోనికి వచ్చాయి. అందుచేత మధ్యంతర యెన్నికలకు ముందు 55 కోట్ల భారతీయుల హృదయం యెలాగ ఉన్నప్పటికీ, మధ్యంతర యెన్నికల్లో మాత్రం మొత్తం భారతీయుల హృదయం కాంగ్రెసు పక్షానికి అంకితమైపోయింది అని ముఖ్యమంత్రి అనడంలో తప్పు యేముంది?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి తిరిగి చెప్పడం ప్రారంభించాడు.

'లోకసభ మధ్యంతర యెన్నికల్లో కాంగ్రెసు పక్షానికి అత్యధిక సంఖ్యాబలం వచ్చింది కాని ముఖ్యమంత్రి చెప్పినట్లుగా మొత్తం ప్రజల హృదయం కాంగ్రెసుకి అంకితమైపోలేదు.

తమిళనాడులో కాంగ్రెసు పక్షానికి వచ్చిన స్థానాలు అన్నీ, ఆ రాష్ట్రంలో అధికారంలో ఉన్న ద్రవిడ మున్నేట్ర కజగం పెట్టిన భిక్ష తప్ప మరొకటి కాదు. ద్రవిడ మున్నేట్ర కజగాన్ని యెదిరించి పోటీచేసే శక్తి కాంగ్రెసు పక్షానికి లేకపోవడం వల్లనే కాంగ్రెసు పక్షం ఆ రాష్ట్రంలో రాష్ట్ర శాసనసభకు అసలు పోటీయే చెయ్యలేక పోయింది.

పశ్చిమ బెంగాల్లోను, కేరళలోను కాంగ్రెసుపక్షం కమ్యూనిస్టులతోను, ముస్లింలీగుతోను యెన్నికల ఒప్పందం చేసికొన్నది. మధ్యప్రదేశ్, రాజస్థాను, గుజరాత్‌వంటి రాష్ట్రాల్లో ప్రతిపక్షాలకు కూడా తగినన్ని స్థానాలు వచ్చాయి.

ఈ పరిస్థితిలో 55 కోట్ల భారతీయుల హృదయం మధ్యంతర యెన్నికల్లో కాంగ్రెసు పక్షానికి అంకితమైపోయిన దనడం హాస్యాస్పదం కాదా?' అని అన్నాడు చూడామణి.

'పోనీ, మధ్యంతర యెన్నికలు అయిపోయిన తరువాత, భారతీయుల హృదయం కాంగ్రెసు పక్షానికి అంకితమైపోయింది' అని ముఖ్యమంత్రి అన్నట్లయితే దానికి నీ అభ్యంతరం యేమిటి?' అని ప్రశ్నించాడు చంద్రరావు.

'మధ్యంతర యెన్నికలు జరిగిన తరువాత కాంగ్రెసు పక్షంయొక్క బలం తగ్గుతూనే ఉంది కాని పెరగడంలేదు. మధ్యం



భారత—అమెరికా వాణిజ్యమండలి మదరాసులో 'దక్షిణ భారతదేశంలోని పారిశ్రామికాభివృద్ధిలో అమెరికా సహకారం నిర్వహించిన పాత్ర' అన్న విషయంపై నిర్వహించిన సదస్సుకి నవంబరు 18 వ తమిళనాడు పరిశ్రమల మంత్రి శ్రీ మాధవన్ ప్రారంభోత్సవం చేశారు. శ్రీయుతులు మాహెన్ మాస్ప్రెక్లీ, నారాయన్, స్టీఫెన్. ఇ. పామర్ (మదరాసులోని అమెరికన్ కాన్సల్ జనరల్) వి. ఎస్. టాండన్, ఎ. ఎమ్. ఎమ్. అరుణాచలం ప్రభృతులతో మంత్రి చర్చిస్తున్న దృశ్యం. —(యు. ఎస్. ఐ. ఎస్)

# టాప్ రహస్యము!



క్రొత్త బినాకా టాప్‌లో మాత్రమే ఒక రహస్యమైన పదార్థము ఉంది కనుక యీ టూత్ పేస్టు మీ నోటిలో అన్ని మూలలకు, పళ్ల మధ్య చిన్న చిన్న సందులలోనికి చొచ్చుకొని పోయి, ఆ చోట్లలో ఉన్న సూక్ష్మ క్రిములను నాశనము చేస్తుంది. అందుకనే మీ నోరు రోజంతా సంపూర్ణముగా శుభ్రముగా, పూర్తిగా తాజాగా ఉంటుంది. అలా మీ నోటి ఆరోగ్యమునకు సంపూర్ణ రక్షణ కలుగుతుంది।

**ఈ నిదర్శనము మీరు చూడగలరు! పరిశోధనాగారములో జరిగే యీ పరీక్షను నేడే మీ యింట్లో చేసి చూడండి!**



ఒక గాజు గిన్నెను తీసుకొని దానిలో నీరు పోయండి. బొగ్గు గుండను లేక రంగు పొడరును నీటి మీద చల్లండి.



బినాకా టాప్‌ను కొంచెము నీళ్లలో కలపండి. ఆ ద్రావకము ఒక చుక్కను గాజు గిన్నె మధ్యలో వేయండి.



బినాకా టాప్ ఎంత త్వరగా అన్ని వైపులకు చేరి మలినమును పోగొట్టి, ఉపరితలమును స్వచ్ఛముగా, తేటగా చేస్తుందో మీరే చూడండి.




## బినాకా టాప్
...సంపూర్ణ నోటి రక్షణ యొక్క రహస్యము

# ముగ్గురు మూర్ఖులు

తర యెన్నికలు జరిగిన తరువాత జరిగిన ఢిల్లీ మ్యున్సిపల్ యెన్నికల్లో కాంగ్రెసు పక్షం వోడిపోయింది. నాగపూరు, ఒరిస్సా యెన్నికల్లోకూడా కాంగ్రెసు పక్షం పూర్తిగా వోడిపోయింది. అందుచేత మధ్యంతర యెన్నికల తరువాత భారతీయుల హృదయం కాంగ్రెసుకు అంకితమై పోయినది అని అనడంకూడా నిజంకాదు' అన్నాడు చూడామణి.

'ఏవో కొన్ని ప్రత్యేకమైన కారణాల వలన ప్రజలు కాంగ్రెసేతర పక్షాలకు వోట్లువేసి ఉండవచ్చును కానీ వారి హృదయం మాత్రం కాంగ్రెసు పక్షానికే అంకితమై పోయినది. అని ముఖ్యమంత్రి అభిప్రాయ పడినట్లయితే దానికి యేమిటి అంటావు?'

'ఇప్పుడు నీమాటలు వినగానే యిది వరకు ఒక షావుకారుచెప్పిన మాటలు నాకు గుర్తుకు వచ్చాయి.'

'ఏమిటి ఆ షావుకారు మాటలు?' అని చిదంబరం ప్రశ్నించగా చూడామణి చెప్పడం ప్రారంభించాడు.

'ఒక ఊళ్లో ఒక షావుకారు ఉన్నాడు. ఆ షావుకారు యింటిపక్కకు ఒక రైతు ఉన్నాడు. బాగా పాలుయిచ్చే అందమైన ఆవు ఒకటి ఆ రైతుకు ఉన్నది

ఒకనాడు షావుకారు చుట్టం ఒకాయన కాశీవెడుతూ షావుకారు యింటికి వచ్చాడు. ఆ చుట్టం షావుకారు యింటిపక్కన ఉన్న ఆవును చూశాడు.

తరువాత ఆ చుట్టం షావుకారు యింటి నుండి వెళ్లిపోతూ ఉన్నప్పుడు, 'బావగారూ! మీరు ఈఊరుకు పెద్ద షావుకారును అని చెప్పుకుంటుంటారు కాని మీ యింటిపక్కను ఉన్న ఆవులాంటి ఆవు మీకు ఒక్కటికూడా లేదు' అని షావుకారును వేళాకోళం చేశాడు.

కాశీనుండి తిరిగివస్తూ ఆ చుట్టం షావుకారు యింటికి మళ్ళా వచ్చాడు. అప్పుడు ఆ ఆవు షావుకారుయింటి ముందు కట్టివేసి వుంది.

'బావగారూ మీరు ఆమాట అనగానే ఆవును రైతువద్ద కొనివేశాను. ఇప్పుడు ఈ ఆవు నా స్వంత ఆస్తి' అని షావుకారు గర్వంగా చుట్టంతో చెప్పాడు.

'చాలా సంతోషం' అన్నాడు చుట్టం.

అదే సమయంలో పక్కయింటి రైతు వచ్చి ఆ ఆవుపాలు పితుక్కొని వెళ్లిపోయాడు.

'బావగారూ! ఆవు మీ స్వంతఆస్తి అన్నారు కదా! రైతువచ్చి పాలు పితుక్కొని వెళ్లిపోయాడు యేమిటి?' అని చుట్టం షావుకారును ప్రశ్నించాడు.

'దానికి ఒక షరతు ఉంది.'

'ఏమిటి ఆ షరతు?'

'మీరు వెళ్ళగానే ఆవును నాకు అమ్మివేయమని రైతును అడిగాను. రైతు అమ్మనన్నాడు. ఏమైనా సరే, ఆవును అమ్మితీరాలని నేను రైతును నిర్బంధం చేశాను. రెండుపూటలా పాలు పితుక్కొనే హక్కు తనకు ఉంచుకొనే పద్ధతిని ఆవును అమ్మడానికి రైతు అంగీకరించాడు. ఆ పద్ధతినే నేను ఆవును కొన్నాను. పాలు పితుక్కొనే హక్కు రైతుకే ఉన్నప్పటికీ ఆవు మాత్రం నా స్వంత ఆస్తి. దీనికి తిరుగులేదు' అని షావుకారు చుట్టానికి సమాధానం యిచ్చాడు' అని షావుకారు మాటలనువివరించాడుచూడామణి.

'ఈ సందర్భంలో నీకు ఆ షావుకారు మాటలు యెందుకు గుర్తుకు వచ్చాయి?' అని ప్రశ్నించాడు చంద్రరావు.

'పాలు పితుక్కునే హక్కు రైతుకు ఉన్నప్పటికీ ఆవు మాత్రం తన స్వంత ఆస్తి అని చెప్పిన షావుకారు మాటలకు— ప్రజలు కాంగ్రెసేతర పక్షాలకు వోట్లు వేసినప్పటికీ, ప్రజా హృదయంమాత్రం కాంగ్రెసుకే అంకితమై ఉన్నది' అని నువ్వు అన్న మాటలకు తేడా యేమిటి?' అని తిరిగి ప్రశ్నించాడు చూడామణి.

'అలాగ అయినట్లయితే, సరిగ్గా యే రోజున యెన్నిగంటల యెన్ని నిమిషాలకు భారతీయుల హృదయం కాంగ్రెసు పక్షానికి అంకితమైపోయిందో ముఖ్యమంత్రి వివరంగా చెపితే సరిపోతుంది కదా!'

'అవును. దానితో మనకు యే సందేహాలు కలగవు.'

'ఇప్పటికే ఆలస్యం అయింది' అంటూ చంద్రరావు లేవగానే మిగిలిన యిద్దరూ అతన్ని అనుసరించారు.

# కళారంగంలో మార్కెటింగ్ సమస్యలు

[ఏదయినా వస్తువుని తయారు చేసి దానిని కొనేవారికి అందచెయ్యటానికి కొంత ప్రయత్నం కావలసి ఉంటుంది. ఈ ప్రయత్నంలో ఎన్నో అంశాలు ఇమిడి ఉంటాయి. అయితే మొత్తం మీద కొనేవారికి అందచెయ్యటానికి కావలసిన విధానాలు లేక పద్ధతులని 'మార్కెటింగ్' అనే మాటతో వర్ణించవచ్చు.

ఈ వ్యాసంలో మార్కెటింగ్ అనే మాటని పైన చెప్పిన అర్థంతో వాడటం జరిగింది.]

ఆంధ్రప్రదేశంలోని అనేక ముఖ్యపట్టణాలలో వివిధ కళా ప్రదర్శనాలు చాలా కాలంగా జరుగుతున్నాయి. ఈఏడు విజయవాడలో నాలుగు కళాప్రదర్శనలు జరిగాయి. వీటిలో ఎన్నోరకాల కళావస్తువుల (లేక ఆర్ట్స్ పీసెస్‌ల) ప్రదర్శనకి అవకాశం లభించింది.

ఈ సందర్భంలో ఆంధ్రలో 'ఆర్ట్స్ పీసెస్'కి కల స్థానం గురించి, వాటి మార్కెటింగ్‌లో ఎదురయ్యే సమస్యలని గురించి కొంత పరిశీలన జరుగవలసి ఉంటుంది.

శిల్పాలు, బొమ్మలు, వర్ణచిత్రాలు, గాజువస్తువులు, విరుచాపలు మొదలయిన ఆర్ట్ పీసెస్‌ని తయారుచేసే కళాకారులు ఆంధ్రలో ఎందరో ఉన్నారు. అయితే వారు తయారుచేసే కళావస్తువులకి తగినంత గుర్తింపు, వాటి వినియోగాన్ని గురించిన అవగాహన ప్రజలలో లేనందువ వాటి 'మార్కెటింగ్' సరిగ్గా జరగటం లేదు. అందుచేత కళాకారులకి తగినంత ప్రోత్సాహం లభించటంలేదు.

విజయవాడ మహిళామండలిలో 'అలంకరణ కళాప్రదర్శన' ఒకటి జరిగింది. దీనిని చూడటానికి ఎందరో వచ్చారు కాని అది ఆడవారిని అంతగా ఆకర్షించలేకపోయింది. దీనికి కారణం ఏమిటని విచారించగా—ప్రదర్శన తమ దృష్టికి అంతగా రానందువల్ల పాల్గొన పోయారన్న సమాధానం వచ్చింది!

సమకాలీన కళాకారులు సృష్టించే స్వరూపాల ప్రదర్శనలు తరచు వాటిని చూసే అవకాశం ఆడవారికి కలిగితే తమ గృహాలంకరణ విషయంలో వారికి కొత్త ఊహలు కొన్ని కలగవచ్చు. కాలెండర్ల బదులు గోడలకి చిత్రపటాలు, కొన్నిరకాల బొమ్మలు తగిలించవచ్చునని వారికి తట్టవచ్చు! ఇటువంటి అలంకరణవల్ల గృహ సౌందర్యం పెరుగుతుందని వారికి తెలిసి రావచ్చు.

ఈ విషయమయి వ్యాపారసంస్థలు, ఇతరసంస్థలవారు కూడా కొంత అభిలాష చూపిస్తే బాగుంటుంది. ఇటీవల విజయవాడలోని పెద్ద హోటళ్ళవారు ముగ్గురూ ఉత్తమ కళావస్తువులకి బహుమతులు ఏర్పాటు చేశారు. వారి ప్రోత్సాహం అభినందనీయం. రోటరీక్లబ్బు లయన్స్ క్లబ్బు మొదలయినవారు కూడా కళాకారులని ఈ విధంగా ప్రోత్సహిస్తే బాగుంటుంది.

కొంతకాలంకింద అమెరికాలో పుస్తకాల అమ్మకం మందంగా ఉండేది. కొందరు పబ్లిషర్లు సినిమా నిర్మాతలని ఆశ్రయించి సినిమాసెట్లు అలంకారణకోసం పుస్తకాలని వాడమని కోరారు. వారి కోరికని ప్రొడ్యూసర్లు మన్నించారు — త్వరలో పుస్తకవ్యాపారంలో పెరుగుదల కనిపించింది!

గృహాలంకరణ అవసరమనే చైతన్యం కలిగినా అదిచేసే విధానాలని గురించి కొంత సలహా మామూలు ప్రజలకి అవసరం. అందుచేత ప్రత్యేకం గృహాలంకరణకి సంబంధించిన ప్రదర్శనలు కూడా జరపాలి.

సౌందర్య పిపాస పెరిగి కళావస్తువుల ఉత్పత్తి పెరగటంవల్ల కేవలం ఒక వర్గం వారే లాభం పొందటం జరగదు. తీరిక సమయాలలో కళావస్తు సృష్టిని ఒక 'హాబీ'గా అలవాటు చేసుకోవచ్చు ఎందరో! వ్యాపారదృష్టి కలవారు తమ తయారీంపులని అమ్మి కొంత ధనంకూడా ఆర్జించుకోవచ్చు.

కళాప్రదర్శనలు ఒక్క రసపోషణం, ప్రదర్శకుల లాభాలకోసమే కాక మన నిత్య జీవితం పరిసరాలని మరింత అందంగా చేసేందుకు తోడ్పడుతాయి. దీనితోబాటు ఎందరికో మేలుకూడా జరుగుతుంది.

ఇటువంటి ప్రదర్శనలు మహానగరాలలో తరచూ జరుగుతూ ఉంటాయి, వాటిని గురించిన వార్తలని పత్రికలలో చదువుతూనే ఉంటాము. కాని, ఆంధ్రప్రదేశంలో విజయవాడవంటి ఊళ్ళలో జరిగే వాటికి తగినంత ప్రచారం దొరకటంలేదు. దీనికోసం అన్నివర్గాలవారు కృషిచెయ్యటం అవసరం.

ఈనాటి యువతరం వారిలో సృజనాత్మకమయిన వ్యాసంగాలపట్ల ఎంతో అభిలాష ఉంది. వారికి తగిన ప్రోత్సాహం లభించేటట్లు చూసే బాధ్యత అందరికీ ఉంది. —కాట్రగడ్డ సరసయ్య



మధు గార్డెన్స్, విజయవాడలో ఏర్పాటు చేయబడిన గాంధీజీ చిత్రకళా ప్రదర్శనలో అప్పటి ఆంధ్రప్రదేశ్ హోం మినిస్టర్ శ్రీ వెంగళరావుగారు, శ్రీ మధుసూదనరావు, శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య

## బలికోరిన గులాబీ

కేరళ ఆల్వాయ్‌కు చెందిన ఓ కుర్రాడు పెరియారు నదిలో తన స్నేహితులతో స్నానంచేసి, ఒడ్డుకొచ్చి నదిలో తేలి ఆడుతున్న ఓ గులాబీపువ్వు కోసం మళ్ళీ నదిలో దిగాడట. అందినట్టే అందిన ఆ పువ్వు అతన్ని చాలా దూరం తీసుకు వెళ్ళి ఆనక దొరికిందట. ఆపువ్వును చేజిక్కించుకుని, వెనక్కు తిరిగి వస్తుండగా అతనో సుడిలోపడి, మునిగి పోయాడట.

### రాగి చేసే మేలు!

కీళ్ళనొప్పులు తగ్గాలంటే శరీరానికి ఎప్పుడూ రాగి తగులుతూ వుండడం ఒక మార్గమట. రాగి కడియం వేసుకున్న డాక్టరుగారొకరు మద్రాసులో ఆ విషయాన్ని వుద్ఘాటించారట. ఆ ముక్క విని మద్రాసు పట్నం మంతా పెట్రేగి పోయిందట. ఎవర్ని చూసినా, ఎక్కడ చూసినా, చేతికి ఓ రాగి కడియమేనట. గాజులకు బదులు, వాచీలకు బదులు




జనం ముదేప్పగా రాగికడియాలు వేసుకు తిరుగుతున్నారట. శరీరంలో పుట్టిన విద్యుత్‌వల్ల కీళ్ళ నొప్పులు వంటివి వస్తాయని, రాగి శరీరంలో పుట్టిన విద్యుత్తును కరిగించే శక్తి కలది కనుక ఆ నొప్పులు ఎగిరిపోతాయనీ శాస్త్రం అన్నదట— మరిహనేం. ఇంట్లో వున్న రాగి బిందెలనూ, చెంబులనూ గాజులుగా మార్చేస్తే పోలా .... వ్యాపెన్! చీప్ బ్యాంగిల్స్!

### విముక్తి కోసం...

ఢిల్లీ కింగ్స్‌వే కాలనీ సి. సి. క్యాంప్‌కు చెందిన ఒక యింట్లో అయిదు శవాలు దొరికాయట. ఆనక ఆ అయిదూ శవాలు గావనీ ఒకామె చావు బ్రతుకుల మధ్య వూగిసలాడుతోందనీ గ్రహించి ఆమెను ఆసుపత్రిలో చేర్పించదట పోలీసు. హోంప్రకాష్ అనే ఆయన ఉబ్బసంతో బాధ పడుతూండేవాడుట. ఆయన ముగ్గురు పిల్లలకూ చెముడేగాక మూగతనం కూడా వున్నదట పుట్టుకతోనే. ఇది చాలక రోజా ఆయనకూ ఆయన భార్యకూ హోరాహోరి

# ఒక వారం విపరీతం — ఫాలాక్షుడు

పోరట. వీటన్నిటినీ వదలించుకోడానికి ఆదంపతులో మార్గాన్ని కనిపెట్టి ఒప్పందం చేసుకున్నారట. ఆ ఒప్పందం ప్రకారం నిద్రమాత్రలు ఎక్కువ మోతాదులో తమపిల్లలకు పట్టిచ్చి, తామూ వేసుకున్నారట. హోంప్రకాష్ భార్యమాత్రం ఆసుపత్రిలో చికిత్స పొందుతోందట. ముగ్గురు పిల్లలూ, హోంప్రకాష్ చనిపోయారట. తమ చావుకు ఎవరూబాధ్యులు కారని ఓ చీటీ రాసి మరీ పెట్టారటవారు.

### కాబరేనృత్యాలు—మహిళల ఆందోళన

బెంగళూరులో కాబరే నృత్యాల పేరిట నగ్న నృత్యాలు పెట్రేగిపోతున్నాయని, అవి గనుక ఆపక పోయినట్లయిన తామిక సహించేది లేదని, అటువంటి ఆటలు చూస్తున్న ప్రేక్షక మహాశయుల్ని బయటకు లాక్కురావాల్సి వుంటుందనీ, తత్ సంబంధంగా నానా గొడవా చెయ్యాల్సి వుంటుందని బెంగుళూరులో వందమంది మహిళలు వూరుమ్మడిగా వూరేగింపు అయ్యాక ప్రకటించారట—భగవద్గీత ఏమని బోధించెను.!




వెటుగామోలో

### భగవంతునికి పదిహేను లక్షలు

కృష్ణాజిల్లా నూజివీడుకు చెందిన వెంకటేశ్వర్లు అనే ఆయన కొన్ని సంవత్సరాలక్రితం వ్రాసిన వీలునామా ప్రకారం తిరుపతివెంకటరమణునికి 15 లక్షల రూపాయలు చేరాయట. పోయిన్నెలలో ఆయన చనిపోయినందు వల్ల. 'వీడూ వచ్చి భగవంతుని వాటా డబ్బు తీసుకుని వెళ్ళ వలసినది' అని ఆయన తరఫువారు తిరుపతి దేవస్థానానికి తెలియ జేశారట.

### కొత్త బీరు రికార్డు!

సిడ్నీకి చెందిన పీటర్ విల్‌కాక్స్ అనే 29 ఏళ్ళ యువకుడు ఆరునిముషాల 45 సెకనులలో




ఓగ్యాలను బీరు త్రాగి ప్రపంచపు రికార్డును సృష్టించాడట.

### పరారైన అమ్మాయిలు!

తిరుపతిలో ఒక కేసు సందర్భంలో అరెస్టయిన 16 ఏళ్ళ వెంకమ్మను, 15 ఏళ్ళ కృష్ణమ్మనూ చిత్తూరు జైలులో పెడితే వారిద్దరూ వాయునందనుల్ని తలుచుకుని ఏడడుగుల గోడగెంతేసి పారిపోయారట— ఎవరూ...ఆడవారే.... అవునండీ! సమాన హక్కులు కదా!

### అమెరికా ఇంద్రజాలికుని అరెస్టు!

అమెరికానుంచి హిందూదేశం వచ్చి పలునగరాలో ఇంద్రజాలం ప్రదర్శనలిచ్చిన ప్రఖ్యాత ఇంద్రజాలికుడు మిస్టర్ జాన్ కాల్డన్ అనే ఆయనను నవంబరు 25వ తేదీన దాల్మియాపురంలో పోలీసులు నిర్బంధంలోకి తీసుకున్నారట. ఈయన బొంబాయి, ఢిల్లీ వంటి చోట్ల మోసం చేసి 68 వేలరూపాయలు ఉడాయించారట— బాపురే!!

## నడివీధిలో నెక్లెస్ అపహరణ!

వేలూరు మారియమ్మన్ కోవెల ప్రాంతంలో వుంటున్న రామచంద్ర అయ్యర్ అనే ఆయన భార్య 22వ తేదీ తెల్లవారు ఝామున 5—30 గంటలకు అవులప్పార వీధిలో వుంటున్న తన తల్లిని చూడ బోయిందట. మధ్యే మార్గంలో కరూర్ కృష్ణస్వామి నాయుడు వీధిలో నో ఆగంతకుడామె మెడలో గొలుసు టక్కున లాక్కుని పారిపోయాడట. ఆ గొలుసు 1700 రూపాయలట!

* * *

అహమ్మదాబాదులో సెంట్రల్ డిఫెన్సు డిపార్టుమెంట్సు (కేంద్రరక్షణ శాఖ) లో ఆఫీసరుగా పని చేస్తున్న ఒకాయన తన భార్య సుధను సినిమాకి తీసుకు వెళ్ళకుండా తానొక్కడే వెళ్ళాడట.




దాంతో ఆ సుధకు కోపంవచ్చి, మీద కిరసనాయిలు పోసుకుని, నిప్పంటించుకుని, ఆత్మహత్య చేసుకున్నదట.

*

కార్వారుకు చెందిన సిరిసి అనే గ్రామంలో నందాబాయి అనే 26 ఏళ్ళ వివాహిత నలుగురు స్నేహితుల సహాయంతో తన భర్తను హాయిగా హత్య చేసిందట. హత్యానంతరం ఆ శవాన్ని 10 మైళ్ళ దూరంలో వున్న టాసంగుప్ప అనే వూరికి మోసుకుపోయి అక్కడో కాలవలో పారేసిందట ఏంచక్కా. అనక ఆ శవం తేలడం వల్ల విషయమంతా తేలి అంతా అరెస్టయ్యారట. కోర్టు వారికి వురిశిక్ష తీర్పు ఇచ్చింది. ●

# ప్రశ్నావళి

**... కె. రామలక్ష్మి ...**

**జి. వి. ఆర్, విశాఖపట్నం**

ఇద్దరు పెళ్ళాలున్న పెద్దమనుషు లనేమనాలి?

ఒక పొరపాటు ధైర్యంగా రెండోసారీ చేసిన వాడంటే చాలదా!

**పి. ఎస్. ఆర్, విశాఖ**

నా పేరు ఈ ప్రపంచానికి, కనీసం ఇండియాకైనా వినికిడి కావాలంటే నేనేం చెయ్యాలి?

హత్యలు చెయ్యండి, లాటరీలో గెలవండి, ఒంటి కాలిమీద నడవండి, ఏ వృక్షాగ్రమో ఎక్కి కూర్చుని నిరసనవ్రతం ప్రారంభించండి—లేదా— కనీసం లెటర్స్ టు ది ఎడిటర్ రాయండి!

**వి. ఎస్. ఆర్, సతారా**

ఒక తప్పునకు ఎన్నిసార్లు పశ్చాత్తాప పడవచ్చు?

చేసిన తప్పే చేస్తుంటే — అలా పశ్చాత్తాప పడుతూనే ఉండొచ్చు.

**ఏం. ఎస్. ఆర్, ఆళ్ళగడ్డ**

"నేటి విద్యావిధానంపై మీ అభిప్రాయం ఏమిటి?

నా పిల్లలు చదువుకుంటున్నారు. అంచేత దాన్ని గురించి ఆలోచించి బెంగపడ్డం ఇష్టంలేదు!

**... ఎస్, న్యాపాల్యంచ**

అబ్బ! ఈ 71 లో కూడా నీలాంటి పిసినిగొట్టులున్నారు మన భారత దేశంలో అని నేనెంత బాధపడ్డానో ఎవరు ఊహించ కలరు?

ఏం చెయ్యను సరస్వతి, పైవాళ్ళ సొమ్ములేదు నా దగ్గర ధారాళంగా ఖర్చు చేయడానికి!

**హెచ్. ఎస్. ఆర్, కాకినాడ**

నేనొక అమ్మాయిని ప్రేమించాను. కాని ఆమె వివాహిత.

కీప్ ఆఫ్ మేరీడ్ ఉమెన్—రావుగారూ.



**ఎమ్. డి. ఎస్, మహబూబ్‌నగరు**

ఒక స్త్రీ హృదయం తీసుకోవాలంటే ఏం చేయాలి?'

ఆమెకి ఇవ్వాలని ఉందో లేదో కనుక్కోవాలి— ముందు. తరువాత మార్గాలు ఆలోచించవచ్చు.

**ఏ. ఎస్. డి, సంగరెడ్డి**

నిజం అబద్ధంముందు వోడి పోతుం దెందుకు?

నిజానిది పీల గొంతుక. అబద్దానిది కంచు కంఠం. అంచేత.

మంచిగా ఉండడం కష్టం అంటారు ఎందుచేత?

మంచికి ఒకేదారి కావడంవల్ల.

**పి. ర్. ఆర్; బి. ఎమ్. కె, తిర్యాంరు**

నవ్వేఆడదాన్ని ఏడ్చే మగవాడిని నమ్మ కూడదంటారు. ఎందుచేత?

నవ్వులో సాధారణంగా మగవాడు తన విట్టూ ఆడది తన పలువరసా ప్రదర్శిస్తుందంటారు. విరగ బడినవ్వడం ఆడదానికి సభ్యత కాదు, అలాగే పిరికిపడి ఏడ్వడం మగవాడి తత్వంకాదు— అంచేత అలా అంటారేమో.

**ఎస్. ఎమ్ పి, కుకుపాం**

మిమ్మల్ని లిఖితపూర్వకంగా 'అండీ' అంటాం. ఎదురుగా మాట్లాడినా గౌర విస్తాం. ప్రశ్నావళి చదువుతున్నప్పుడు రామలక్ష్మి రాసిందిరా, అంటాం. ఈ బల హీనత ఏమిటి?

బలహీనత కాదు. అదొకరకం ఆప్యాయత!

**కె శి. ఆర్, విశాఖ**

విప్లవ సాహిత్యం అంటే?

చెప్పకూడదు గాని. . . . . చంపు, నరుకు, లే, పద—రక్తం!

**ఎ. ఎల్. ఆర్, సిద్దిపేట**

ఏమండీ రామలక్ష్మిగారూ, నేనొక మంచిపని చెయ్యాలని అనుకుంటున్నాను. ఏవిధంగా మొదలుపెట్టాలో తోచడంలేదు.

ఏమండి, డి. ఎమ్. కె. భక్తులైతే— గణపతి బొమ్మ పగులకొట్టి ప్రారంభించండి. రాజాజీ భక్తులైతే వినాయకుణ్ణి పూజించి ప్రారంభిం చండి.. సరేనా?

**పి. ఆర్, గిద్దలూరు**

మీ చెత్తబుట్టకు ఆకలి ఎక్కువేమో అనిపిస్తోంది. ఆకలికి కూడా పొదుపు అనేది ఉంటే ఆరోగ్యానికి మంచిదని ఆశిస్తాను...

లేదండీ, నాకంత పరిమితపుటాకలి లేదు— ఏదో 'ప్రేమించాను ఏంచెయ్యను?' 'రాశాను ఏంచెయ్యను' 'కార్టూనులు పెన్నుతోనా పెన్సిలు తోనా' 'కామాలు పులుస్టాపులూ పేరాలూ మీరు పెడతారా, రాసిన వాళ్లే పెడతారా?' లాంటివి వస్తే, ఇక ఆగలేక నాబుట్టగారు గుటకాయిస్వాహా చేస్తుంటారు. కొంపతీసి మీరూ అలాంటిదేనా ఏమిటి రాస్తే!

**వి. పి, జగ్గయ్యపేట**

ఆరుద్రగారి అడ్రసు కావాలంటే (ఇది పర్సనల్ ప్రశ్న కాదనుకుంటా)

కాదు. అయినా నాకు తెలియదండీ!

**పి. జె. ఎస్, మద్రాసు**

లేడీ అంటారే—అంటే అర్థం?

సాటివారిని మరిచిపోకుండ తనని తానూ మరిచి పోని ఆడది— లేడీ.

**టి. ఆర్, విజయనగరం**

ఇష్టమైన పాట ఏ రేడియోలో విన్నా ఒకటే కదా? నాకు అలా ఉండదు ఎందుకండి?

నాకూ అంతే! ఎదుటి వారి రేడియోలో మెటాలిక్‌గా విన్పిస్తుంది. నా రేడియోలో ఎదురుగుండా సుశీల కూర్చుని పాడుతున్నట్టు, బర్మన్ పాడు తున్నట్టు ఉంటుంది!...

**కె. యు. ఎస్, జగ్గయ్యపేట**

మీరు పాఠకులకు ఇంత చురుకుగా జవాబులిస్తుంటారు దీనికి గూడా ఏదైనా కోర్సు వుందా?

కొంచెం కారం, పులుపూ ఉండే భోజనమే కోర్సు!

**ఎమ్. ఆర్. ఆర్, గన్నవరం**

నాకు ఆత్మహత్య చేసుకుని చచ్చిపోవా లని ఉంది. అంతేకాదు. నన్ను బాధ పెట్టిన వారికి శిక్షగా వారింట్లో చచ్చి పోవాలని ఉంది.

ఎందుకూ? ఎవరేనా ఏకొంపన్నా అడిగారా?



మావయ్య దగ్గరినుండి ఉత్తరం వచ్చి రెండు రోజులైంది—రమణకి వంట్లో బాగుండలేదనీ, వోసారివచ్చి చూచి వెళ్ళమనీ ఉత్తరం అందగానే రమణ దగ్గరికి వెళ్ళటానికి వీలుపడలేదు. ఏదో వీలు చూచుకొని సాయంత్రం ఐదింటికే వచ్చాము ఆస్పత్రినుండి; ఈ రోజు అయినా మావయ్యవాళ్ళ వూరు వెళ్ళాలని అందులోనూ మరుసటిరోజు ఆదివారం సెలవు గనుక. కాని—నేను ఇంటికి వచ్చేసరికి యింటి దగ్గర కారులేదు. ప్రక్కవూళ్ళో పనుందని అన్నయ్య కారులో వెళ్ళారుట. అనుకున్న పని జరక్కపోయేసరికి విరసం పుట్టుకొచ్చింది.

రమణకు ఎలావుందో? ఏమిటో? అసలు రమణని చూడాలని నెలరోజులనుంచీ అనుకుంటున్నాను. తీరికెక్కడ ఏడ్చింది. రాత్రింబవళ్ళు గానుగెద్దులా ఆస్పత్రిలోనే సరిపోతోంది. ఆ వూరికి నేనొక్కర్నే డాక్టర్ని, అందులోనూ గవర్నమెంటు ఉద్యోగం. ఈరోజు వీలుచూచుకొని పెందరాళే యింటికివస్తే, సమయానికి కారు లేదు.

క్రితంరాత్రి పీడకలం వచ్చింది. రమణ రూపం పదేపదే కలలో కన్పించిందింది. 'బావా నామీద దయలేదా? నెలరోజులైనా ఒక్కసారి కూడా తమ దర్శనం కలిగించలేదు' అని దీనంగా కనిపించి అడిగింది కలలో.

అందుకే ఈరోజు ఏమైనాసరే రమణని చూచి తీరవలసిందే! అని నిశ్చయించుకున్నాను. నా నిర్ణయానికి ఆదిలోనే హంసపాదు కోపంతో వేడెక్కిపోయాను.

నా పరిస్థితిని పసిగట్టినట్లుంది

అమ్మ— 'ఏమిట్రా అంత తొందర. అన్నం తిని వెళ్ళవచ్చులే. అందులోనూ కారు ప్రయాణమాయె కన్నుమూసి కన్ను తెరిచేంతలో మీ రమణదగ్గరుంటావు' అమ్మ అంది.

ఇక చేసేదిలేక అన్నంతిని, అన్నయ్య వచ్చింతర్వాత కారు తీసుకుని బయలు దేరాను. నా తొందరకీ, హడావుడికీ వదినా అన్నయ్య ముసిముసిగా నవ్వుకున్నారు.

కారును స్టార్టుచేసిన తర్వాత టైం చూచుకున్నాను. సరిగ్గా పదిగంటలకి యింకా పదినిమిషాలుంది.

అమ్మ గుమ్మంవరకూ వచ్చి అంది 'ఏమిటోరా రామూ! నీమతం నీది. చీకట్లో బయలుదేరి వెళ్తున్నావు. ఇటు నీకూ బాధగానే వుంటుంది. అటు మీ అత్తా వాళ్ళని కష్టపెట్టడ మవుతుంది.'

'ఏమైనాసరే రాత్రి ఎంతచీకటి పడినా సరే రమణనిచూచి తీరవలసిందే. అది నా నిర్ణయం.

అన్నయ్య అన్నాడు 'చిన్నా! రోడ్డు సరిగ్గావుండదు జాగ్రత్త.'

ఎలాగో వాళ్ళని వదిలించుకొని కారు ముందుకు నడిపాను.

కారు మావూరి మలుపుతిరిగి కంకిపాడు రోడ్డుమీదికి వచ్చింది. ఎత్తు పల్లాలూ, చిన్న చిన్న గుంటలూ—రోడ్డుమీద ఎక్కువగా కనబడతాయి.

మావయ్య వాళ్ళవూరు మావూరికి కనీసం యిరవై మైళ్ళయినా వుంటుంది. దారిలో, మధ్య మధ్యలో రోడ్డుకు దూరంగా చేలల్లో చిన్న చిన్న గ్రామాలు కన్పిస్తుంటాయి గుడ్డిదీపాల వెలుతుర్లో.

కారు ఎ. యస్. ఆర్. కాలేజీ దాటింది. కారు నడుపుతున్నానన్న మాటేగాని, నా ఆలోచనలన్నీ రమణమీదే. రమణకి ఎలా వుందో!—

రమణ మా మావయ్యగారి అమ్మాయి. రమణని నాకిచ్చి పెళ్ళి చేయాలని మావయ్య వాళ్ళ పట్టుదల. అంతేకాకుండా మావాళ్ళకి కూడా ఈ సంబంధం చాల ఇష్టం. అసలు అంతెందుకూ రమణ అంటే నాకూ అమితమైన యిష్టం. రమణకి నేనంటే ఎంతప్రేమ! నేను వారానికి కనీసం ఒక ఉత్తరమైనా వ్రాయకపోతే ఎంత బాధపడిపోతుందో!

## ఆ పెం కధ

ఎప్పుడూ 'బావా! బావా!' అంటూ కలవరిస్తుంటుంది. ఈ వేసవి సెలవుల్లో పెళ్ళిచేయాలని మావాళ్ళ ఆలోచన. నాకూ తొందరగానే వుందనుకొండి.

కారు తారురోడ్డుమీద జోరుగా పోతోంది.

హెడ్‌లైట్లకాంతిలో తారురోడు పాములా కనబడుతోంది. రోడ్డుమీద అసలు జనసంచారమే లేదు; నాకారూ నేనూ తప్ప. రోడ్డుకి రెండువైపులా పెద్దపెద్ద చెట్లు దయ్యాల్లా జడలు విరబోసుకొని భయాన్ని కల్గిస్తున్నాయి. దూరంగా పొలాలు... ఆ గట్టుమీద చెట్లలో పేరు తెలియని పక్షుల వింత అరుపులు.

అమావాశ్యనాటి చీకటి వికృతంగా వికటాట్టహాసం చేస్తోంది. చెట్లమీది పిట్టల అరుపులు నిశ్శబ్దాన్ని చీల్చుకొని వినబడుతున్నాయి.

రోడ్డుప్రక్కన కాలువలో నిలువ వుండిన నీరు పసిరికపట్టి వాసన కొడుతున్నాయి. నీటిలో కప్పలు బెకబెక అరుస్తున్నాయి.

ఉన్నట్లుండి సమీపంలోని చెట్టుమీద నుండి గుడ్లగూబ పెద్దగా చెవులు చిల్లులు పడేలాగ అరుచుకుంటూ ఎక్కడికో ఎగిరి పోయింది రెక్కలు రెపరెప లాడించుకుంటూ. మరికొంతదూరం పోయేసరికి వో కప్ప కారుక్రిందపడి పెద్దగా శబ్దం చేసింది...

నా కప్పుడు కొంచెం భయం అనిపించింది; నిజం చెప్పొద్దూ. నేనెన్నో పోస్టుమార్టమ్ కేసులు చూశాను. చచ్చి వాసన కొడుతున్న శవాల్ని నిర్భయంగా కత్తులతో కోసి పరీక్ష చేశాను. రక్తం ప్రవహిస్తున్నా, బాధతో మూలుగుతున్నా, గుండెని రాయిగా చేసుకొని ఎన్నో ఆపరేషన్లు చేశాను. కానీ—నేనేనాడూ అంతగా భయపడలేదు... అలాంటిది... ఈ రోజు... ఏమిటో భయం, భయంగా వుంది.

కానీ, నా ఆలోచనలన్నీ రమణమీదే వుండటంవల్ల అంతగా భయాన్నిగురించి ఆలోచించలేక పోతున్నాను.

కారు నడుపుతున్నాను—నా ఆలోచనలు అదుపులో పెట్టుకొని.

దూరంగా... ఒక వందగజాల దూరంలో లైటు కాంతిలో ... ఎవరో స్త్రీ రోడ్డుకి అడ్డంగా నిలబడివుంది. ఆమె చేయి 'సిగ్నల్'గా చాపివుంది. బహుశా కారుని ఆపాలని ఆమె ప్రయత్నంకాబోలు.

టైం చూచుకున్నాను. సరిగ్గా పదకొండూ యిరవై. ఏమిటి టైం తెలియకుండానే గడిచిపోయింది — అనుకున్నాను. బహుశా ఆలోచనలతో కారుని ఎక్కువ స్పీడులో నడిపివుండలేక పోయానేమో !!

కారు ఆమెని సమీపించింది. బ్రేకు వేశాను. ఆమె నా దగ్గరకే వచ్చింది. ఆమెని ఎవరుకో అనుకోకుండా క్రింది నుండి పైకి వోసారి చూశాను.

### చిట్కా— స్వీట్స్

**పూల సజ్జిగ**

కొంచెం నెయ్యి బాణలిలో వేసి బాగా కాగిన తరువాత గోధుమనూక కొంచెం కొంచెంగా వేసి మాడిపోకుండా వేయించాలి. దానిమీద పాలు చల్లుతూ బాగా కలియపెట్టి దించుకోవాలి. తీపి కావలసిన వాళ్ళు ఈ పాలలో బాగా చక్కెర వేసుకోవచ్చు.

**గుజరాతీ హల్వా**

బూడిద గుమ్మడికాయ చెక్కగా తరుక్కొని తెల్లనిబట్టలో వేసి నీరు పిండి ఆ ముద్ద— తగినంత చెక్కరవేసి రుబ్బి బాగా నెయ్యికాచి సారపప్పు, బాదంపప్పు, జీడిపప్పు వేగాక ఈ ముద్దవేసి పచ్చివాసన తగ్గేదాకా కలియపెట్టి దింపుకోవాలి.

**అట్టుబాకి**

పచిపలాలు జీడిపప్పులు దంపుకోవాలి. కొంతపప్పు చిన్న చిన్న ముక్కలుగా చేసి ఉంచుకోవాలి. వో పలం బాదంపప్పు, సారపప్పు, దోసగింజలు, ద్రాక్షలు, అన్నీ వేరువేరుగా వేయించి, చక్కెరపాకంపట్టి దాన్లో యివన్నీ వేసి కలియబెట్టి వెడల్పాటి పళ్లెంలో నెయ్యి రాసి పోయాలి. చల్లారాక బద్దలుగా కోసుకోవాలి.

**దూద్ పేడా**

గేదెపాలు ఇగిరేలా బాగా కాచి దింపి దాన్లో ఒక ఆళాకు గోధుమపిండి వేసి కలియపెట్టి చిన్న బిళ్లలుగా తట్టి పచ్చిబియ్యపు పిండి పంచదార కలిపి యీ బిళ్లలకి అద్దాలి. తీపి ఎక్కువ కావలసిన వాళ్ళు పాలలో పంచదార వేసి కాయవచ్చు.

—శ. రా

తెల్లచీర...తెల్లని రవికె...తలంటు పోసుకున్న వెంట్రుకలు అందమైన ముఖం మీదపడి, చిరుగాలికి నాట్యం చేస్తున్నాయి ...ఎర్రగా ... పొడుగ్గా...చాలా అందంగా వుంది.

'ఏమిటలా చూస్తున్నారు?' — ఆమె చిరుకోపాన్ని ప్రదర్శించింది. నా తప్పుకు నాకే సిగ్గనిపించింది.

'ఎందుకు కారాపారు?'

'ఏమండి'

'ఏమిటాపని' కొంచెం కఠినంగానే ధ్వనించింది నా కంఠం. కారణం నా ఆలోచనల్లోకి రమణ రావడమే.

'దయువుంచి నన్ను కారులో ఎక్కించుకోండి' ఆమె ప్రాధేయపూర్వకంగా అడుగుతుంటే నాకు జాలివేసి, కాదనలేక డోరు తెరచి ఎక్కమన్నాను

ఆమె కారెక్కింది.

జేబులోంచి సిగరెట్టుపెట్టె తీసి, సిగరెట్టు వెలిగించుకొని, గట్టిగా హో దమ్మలాగి, ఆమెను మళ్ళీ వోసారి చూచి, మళ్ళీ కారుని స్టార్టుచేసాను. కారు కదిలింది. కదిలిన కారుతోపాటు ఆమెను గురించిన ఆలోచలుకూడా బుర్రలో కదిలాయి.

ఎవరీమె? ఎందుకు వంటరిగా ప్రయాణం చేస్తోంది. ఎక్కడి కెడుతుంది? ఎందుకు?

# ఆమె కథ

'నన్నుగురించి ఆలోచిస్తున్నట్టున్నారు' —నా ఆలోచనలని పసిగట్టింది కాబోలు, నా ముఖంలోకి చూస్తూ అడిగింది.

నేను సమాధానం చెప్పలేదు. ఆమె అంది 'నేను వెంట్రప్రగడ వెళ్ళాలి మీరు ఎక్కడివరకు వెడుతున్నారు?'

నేను వెళ్ళవలసింది వెంట్రప్రగడే. అదే మావయ్య వాళ్ళవూరు. ఆ విషయమే చెప్పాను.

ఆమె ఏమనుకుందో ఏమిటో నాప్రక్కకి కొంచెం జరిగి 'వంటరిగా వెళుతున్నారేమిటి?'—అంది.

నాకు కొంచెం భయంవేసిన మాట వాస్తవమే. బహుశా పిచ్చిదేమో! పిచ్చిదైతే అంత తెలివిగా ఎందుకు మాట్లాడుతుంది. మరి ఈమె ఎవరు?...నన్ను వలలో వేసుకోడానికి ఎవరైనా దొంగలు ఈమెని ముందుగా పంపించారేమో! లేక నక్సలైటా? ... లేక దయ్యమా? ... ఎవరు?...ఎవరు?...ఏమో!! గుండెలు దడ దడ కొట్టుకున్నాయి.

'భయపడకండి నేనేమీ మీకు హాని చేయను. తొందరపనిమీద వెళ్ళతున్నాను. అందువల్లనే యింత చీకటిలో వంటరిగా బయలుదేరాను'—ఆమె అంది, చిన్నగా నవ్వుతూ ఆమె నన్ను అణువణువునా పసిగడుతోంది.

ఆమెనుగురించి తెలుసుకోవాలనే ఉత్సాహం నాలో క్షణక్షణానికి అధికమౌతుంది. ఎలా అడగాలో అర్థంకాక మౌనంగా వుండిపోయాను.

ఏదో పొలంలోనుండి... కొంచెందూరం నుండి ... నక్కఅరుపు సైరన్ కూతలా వినిపించింది ... ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాను...కారుకూడా మలుపు తిరిగింది బాలెన్సుతప్పి; భయంతో...కారుని మళ్ళీ యథాస్థానంలోకి తీసుకు వచ్చాను.

బట్టలన్నీ చెమటలో తడిసిపోయాయి. రోమాలు నిక్కబొడుచు కున్నాయి

'మీతో మీరే ఆలోచించుకోడం ఏమీ బావుండలేదు. మీకు తోడుగ నేనున్నాను. నాతోమాట్లాడండి. లేదా మీకు నా కథ చెబుతాను వినండి.' ఆమె అంది.

అమ్మయ్య! నేను ఆమెను గురించి తెలుసుకోవాలనే కుతూహలం యింత తొందరగ సెటిల్ అవుతుందని అనుకోలేదు,

'సరే చెప్పండి' అన్నాను, మరో సిగరెట్ ముట్టించి.

ఆమె తన కథని చెప్పడం మొదలు పెట్టింది—

'నా పేరు అనూరాధ. అందరూ 'రాధ' అనే పిలుస్తారు'— ఆమె తన కథను ఆపి నావైపు చూచి చిన్నగా నవ్వుతూ అంది 'సారీ! నా కథ చెప్పబోయేముందు మీపేరు తెలుసుకోవడం నావిధి.'

'రామారావు' నేను చెప్పాను.

'...మాది గుడివాడ సమీపంలోని హో పల్లెటూరు స్వగ్రామం. కానీ మానాన్నగారి ఉద్యోగరీత్యా మేము గుడివాడలోనే స్థిరపడిపోయాము. నాన్నగారి పేరు శేషయ్య. మంచిపేరూ మర్యాదా వున్న మనిషి మావూర్లో. మా అమ్మ పేరు హైమావతమ్మ. నాకు తోబుట్టువులు ఎవరూ లేరు. అందువల్ల నన్ను అల్లారు ముద్దుగా పెంచి పెద్దచేసి చదివించారు...'

'ఎంతవరకు చదువుకున్నారు'— మాట మధ్యలోనే అడిగాను. నా తొందర్నిచూచి ఆమె నవ్వింది, వెన్నెల పిండారబోసినట్లు, ఆమె నవ్వులో కోటి నెమళ్ళు నాట్యం చేసాయి.

'అంత తొందరెందుకు? అన్ని విషయాలూ నేనే చెబుతానుగా. నేను ఎ. ఎన్. ఆర్. కాలేజీలో బి. ఎ. చదివే



రోజుల్లో నాకు జయచంద్రతో పరిచ యమైంది. అతడు నా క్లాస్‌మేట్. మంచి మార్కులు వచ్చేవి. చక్కటి కథలు రాసే వాడు. ప్రతి కథలోనూ ఉత్తమ ఆదర్శాలూ, ఉత్తమ భావాలూ పుట్టిపడు తుండేవి. సంఘాన్ని, సంఘంలోని కుళ్ళుని వెలెత్తి చూపించేవాడు తన రచనల్లో. అతని కథలు నన్నెంతగానో ఆకర్షించాయి. నా ఆకర్షణ అతని కథలమీదినుండి అతని మీదికే మళ్ళింది, కొంతకాలానికి. అందుకే అతన్ని గురించి తెలుసుకోవాలనిపించింది. ప్రత్యక్షంగానే అడిగాను ఓరోజు...

'... అతడు చెప్పిన విషయాలు మొదట్లో నన్ను కొంచెం కలవర పెట్టినై. అతను చాల పేదకుటుంబానికి చెందిన వ్యక్తనీ, తల్లిదండ్రులు చనిపోయారనీ, ఎవరో దూరపు బంధువు చేరదీసి చది విస్తున్నాడనీ నాతో చెప్పాడు. కాని—నేను నా అభిప్రాయాన్ని మాత్రం మార్చుకో లేదు.

'తర్వాత కొన్ని రోజులు సాఫీగానే గడిచాయి. కాని రాను రాను ఎందుకో అతన్ని చూడందే, అతడితో మాట్లాడందే వుండలేకపోయేదాన్ని. అతడుకూడా నాస్థితి లోనే ఉన్నాడు. అందుకే మేమిద్దరం పెళ్ళిచేసుకోవాలని నిశ్చయించుకొన్నాము. నా నిశ్చయాన్ని మా నాన్నగారితో చెప్పాను. నాన్నగారు అగ్గిమీద గుగ్గిలంలా మండి పడ్డారు. అమ్మకూడా మాపెళ్ళికి ఇష్టపడలేదు. కారు — ఆస్తి — బంగళా—పలుకు బడీ — బాంకులో ఎకౌంటూ—అన్నీ అడ్డు వచ్చాయి నాన్నగారికి. అమ్మతో ఎన్నో విధాల చెప్పాను; అమ్మ మనస్సు మార్చాలనీ. అమ్మ మారలేదు. నాన్నగారు అసలే పట్టుదలగల మనిషి. నా ఆటల్ని కట్టించాలనీ చదువుకు స్వస్తిచెప్పమన్నారు. నాకు పెళ్ళిచెయ్యాలని పెళ్ళి ప్రయత్నాలు కూడా చేయసాగారు. కానీ నా నిర్ణయం మారదు, మార్చుకోలేను.

'అందుకే ఓరోజు ఎవరికీ చెప్పకుండా ఇంట్లోంచి జయచంద్రతో లేచిపోయాను. ఏలూరులో ఓ చిన్న ఇల్లు అద్దెకు తీసుకొని క్రొత్త కాపురం పెట్టాము. అందరూ నన్ను బరితెగించిన ఆడది అన్నారు. అయినా నేను బాధపడలేదు. నాకిష్టమైంది. వచ్చేశాను. అనుకూల మైన దాంపత్యం అని అనుకున్నాను. తెగించాము. అంతే! నాకష్టుడు ఎవరేమన్నా

# ఆమె కథ

బాధ కలగాలేదు...' ఆమె కంఠం వొణికింది. కళ్ళుతుడుచుకుంది బాధగా.

నేను మరో సిగరెట్ వెలిగించాను. నేను మాట్లాడేలోపలే ఆమె మళ్ళీ తన కథని ప్రారంభించింది.

'పది నెలలు ప్రశాంతంగానే గడిచిపోయాయి. సినిమాలు — పార్కులూ షికార్లూ — ఒక్కటేమిటి? అన్నీ ఆ పది నెలల్లోనే అనుభవించాము. నేను వస్తూ కొంత డబ్బు తీసుకొనివచ్చాను. ఆ డబ్బు అట్టేకాలం రాలేదు. తర్వాతకూడా అతడు నాకోసం చాల డబ్బు ఖర్చుచేయడం మొదలు పెట్టాడు. నాకు చాల ఆశ్చర్యం వేసింది. అతను చాల పేదవాడినని చెప్పుకొన్నాడు. మరి యింత డబ్బు ఎక్కడనుండి తీసుకొని వస్తున్నాడో అర్థంకాలేదు.

'ఓ రోజు అతడు అంబాసిడర్ కారులో ఇంటికి వచ్చాడు. నేను ఆశ్చర్యపోయాను. కారుల్లో తిరగడానికి అతని దగ్గర అంత డబ్బెలా వచ్చిందో అర్థంకాలేదు. అతనితో పాటు ఎవరో ఒక పెద్దమనిషికూడా వచ్చాడు. నేను వారికి తగిన విధంగానే మర్యాద చేశాను. తర్వాత ఆ వచ్చిన బుర్రమీసాల ఆసామితో వెళ్లిపోయాడు. అంతే!

'ఎక్కడికి వెళ్ళిపోయాడో, ఎందుకు వెళ్ళిపోయాడో నాకు అప్పుడు అర్థంకాలేదు. నెల రోజులు గడిచిపోయాయి. రెండు నెలలైంది. ఇంకా వస్తాడు యింకా వస్తాడు అని ఎదురు చూశాను. నా ఆశ నిరాశగానే మిగిలిపోయింది. ఓ రోజు జయచంద్ర మిత్రుడొకడు కనిపించి చెప్పిన మాటలు విని నా చెవుల్ని నేనే నమ్మలేకపోయాను.

'జయచంద్రతో ఆరోజు వచ్చిన ఆసామి అతడి తండ్రట. ఆ కారు వాళ్ళదేనట. వాళ్ళది రాజమండ్రట. వాళ్ళ నాన్న అతని యింటికి తీసుకొనిపోయి, ఏదో మంచి మాటలుచెప్పి అతన్ని మరో సంబంధానికి ఒప్పించి పెళ్ళి జరిపించాడుట...... ఈ విషయం విన్న తర్వాత ఎంతగానో కుమిలిపోయాను. నా తప్పుకు నేనే బాధను అనుభవించాలి. అందుకే నేను మళ్ళీ జయచంద్ర దగ్గిరికి వెళ్ళలేదు. వెళ్ళి అతన్ని బాధించాలని అనుకోలేదు. జరిగినదానికి లోలో నేనే కుమిలిపోయాను.

'అమ్మ నాన్న గుర్తుకు వచ్చారు ఆక్షణంలో. భోరున ఏడ్చాను. నేను సంఘానికి పనికిరాను. తల్లిదండ్రుల దగ్గరికి వెళ్ళాలనే ఆలోచనరాలేదు. ఎన్నోసార్లు చావాలని ప్రయత్నించికూడా చావలేకపోయాను. అందుకే యింకా జీవచ్ఛవంలా బ్రతికివున్నాను...ఇదీ నాకథ...' ఆమె తన కథని ఆపి, చీరకొంగుతో ముఖాన్ని, కళ్ళనీ తుడుచుకుంది.

ఆమె కథని విన్నతర్వాత నాకు నిజంగా జాలివేసింది; ఆమెని చూస్తే. ఆమెకు వయస్సులేదు. కాని వయస్సుకు మించిన కష్టాలు ఆమెని కృంగదీస్తున్నాయి...అని అనుకున్నాను.

నమ్మి మోసపోయింది పాపం!

నేను మరోసిగరెట్టు వెలిగించాను.

'ఐతే మీరిప్పుడు వెంట్రప్రగడ ఎందుకు వెళుతున్నారు?' అడిగాను.

ఆమె గట్టిగా వూపిరి పీల్చుకుంది.

'వెంట్రప్రగడలో నా స్నేహితురాలు ఒకామెవుంది. ఆమెపెండ్లి ఈరాత్రికి జరుగుతుంది. అందుకని వెళుతున్నాను'— ఆమె అంది.

నాకు కొంచెం ఆశ్చర్యంవేసింది. ఇంత రాత్రివేళ ఎందుకు బయలుదేరినట్లు సాయంత్రం బయలుదేరి వెళ్లవచ్చును గదా!

'ఇంత రాత్రివేళ ఎందుకు బయలుదేరారు?'

'పగలు బయలుదేరాలని అనిపించలేదు. ఎందుకంటే నా పాపిష్టిమొఖాన్ని అందరికీ చూపించడం నాకిష్టంలేదు. అందులోనూ ఈరోడ్డు నాకు సుపరిచితమే'—అందామె.

ఇంతలో కారు తారురోడ్డు మలుపు తిరిగింది. మట్టిరోడ్డుమీద అడుగు పెట్టింది. దూరంగా రెండుమైళ్ళ దూరంలో వెంట్రప్రగడ కనబడుతోంది పంచాయితీవాళ్ళ గుడ్డిదీపాల వెలుతుర్లో.

కారు చక్రాలక్రింద మట్టిగడ్డలుపడి దూరంగా ఎగిరి పడుతున్నాయి. నాఆలోచనలు కూడా ఎగిరెగిరి పడుతున్నాయి.

రాధ చాల అమాయకురాలిలా కనబడుతోంది. జయచంద్ర ఆమె జీవితాన్ని అన్యాయంగా బలిచేశాడు. ఎలా బ్రతుకుతుందో ఏమో! అయినా జయచంద్ర

లాంటి మహనీయులు శాలాపోలం పుట్టారీ లోకంలో. ఉత్తమ ఆదర్శాలంటూ బ్రహ్మాండగా ఉపన్యాసాలూ, కథలూ అంది స్తారు. కాని చేతల్లో చూపించరు. ఏది ఏమైనా జయచంద్ర మోసం చేశాడు. రాధ మోసపోయింది.

'కారు ఆపండి'—ఆమె అంది. నా ఆలో చనలనుండి తేరుకొని ఆమెవైపు తిరిగాను.

'ఇక్కడ దిగిపోతాను.'—మళ్ళీ ఆమె అంది.

వెంట్రప్రగడ యింకా వంద గజాల దూరంలో కనబడుతుంది. చీకటిలో తెల్లని యిళ్ళు మసగ్గా కనబడుతున్నాయి. పంచాయతీ వాళ్ళ దీపాలు గుడ్డిగా కిరస నాయిలు దీపాల్లా వెలుగుతున్నాయి.

'ఊళ్లో మీ స్నేహితురాలింటి దగ్గర దించుతాను'— కారు ఆపకుండానే అన్నాను.

'వద్దు. వద్దు. నేను మీతో వూళ్లోకి రావడం మీకూ నాకూ అంత శ్రేయస్కరం కాదు '—అందామె.

నాకూ నిజంగానే అనిపించాయి ఆమె మాటలు.

కారాపాను.

ఆమె దిగింది.

'చాల థాంక్సు. మీ సహాయాన్ని నేనెన్నడూ మర్చిపోలేను.'—ఆమె చిరునవ్వు నవ్వుతూ అంది. చీకట్లో ఆమె నవ్వు వెన్నెల రేకులా రెపరెపలాడింది.

'వస్తానండి'—కారును స్టార్టు చేసాను.

అంతే!!

వెనుకనుండి పెద్దగా నవ్వులు వినిపిం చాయి.

ఒక్కసారిగ వళ్ళు గగుర్పొడిచింది.

వెనక్కి తిరిగి చూడకుండా కారుని ముందుకు పోనిచ్చాను, ఎంతో వేగంతో కారు దూసుకుపోయింది.

మరుసటిరోజు రమణతో ఆ రోజు రాత్రి జరిగిన విషయాన్ని గురించి చెప్పాను. రమణ ఆశ్చర్యపోయింది.

'రాధ నెల్రక్రితం విషంత్రాగి చచ్చి పోయింది.' అంది

'రాధ నీకు తెల్సా?' అడిగాన్నేను.

'రాధ నాక్లాస్‌మేట్' కొంచెంసేపాగి 'ఏం బావా! భయపడ్డావా!' అంది నా ముఖంమీద పట్టిన చెమటని చీర కొంగుతో తుడుస్తూ. ●

# వైరాగ్యమేవాభయం



బులుసు వెంకటరమణయ్య. ధర్మపథం

ఆహార నిద్రాభయాదులు ప్రతి ప్రాణికీ సహజమైనవి. అన్ని ప్రాణులూ తమ్ము ఇతరాల వల్ల కలిగే అపాయాలను తప్పించు కోడానికి ప్రయత్నిస్తూ ఉంటాయి. అలాం టప్పుడు తమకు ఏ ఆపద కలుగుతుందో అనే భయం ఉంటుంది. మానవ జీవితంలో ప్రతిఘట్టంలోనూ ఈ భయమనేది ప్రత్యక్షమవుతూ అతని సుఖానికి అడ్డు తగులుతూ ఉంటుంది.

రుచికరమైన పదార్థాలు తిని సంతో షిద్దామంటే—అలాంటివి ఒక మోతాదు ఎక్కువతినడం సహజం కాబట్టి రోగం వస్తుందేమో అని భయం కలుగుతుంది. గొప్పవంశంలో పుట్టినందుకు నలుగురి లోనూ గౌరవం వుంటుందని అనుకొంటే ఆ కుటుంబ సంప్రదాయాలను అసలు జరుపగలమో, లేమో అని భయం! ధనం వుందని సంతోషిస్తే—ఆ సంగతి తెలుసు కుని ప్రభువు ఏదో మిషపెట్టి దాన్ని అపహరిస్తాడనే భయం పీక్కుతింటుంది. తాను ఆత్మాభిమానం కలవాడనని అను కుంటే—దైన్యం ఏర్పడి స్వాభిమానం దెబ్బ తింటుందేమో అని భయం ఏర్పడుతుంది. బలంవుంటే — శత్రువులు ఏర్పడుతారేమో అని భయం! అందమైనరూపం ఉన్నదను కుంటే—ముసలితనంవచ్చి అందం పోతుం దనే భయం బాధిస్తుంది. శాస్త్ర పాండి త్యం సంపాదిస్తే—తనతో వాదించడానికి ఎవరైనా విద్వాంసులు వస్తారేమో అనే భయం! మంచి గుణాలుంటే—దుర్మార్గులు ప్రచారంమూలంగా చెడ్డపేరు వస్తుందేమో అని భయం! శరీరం దృఢంగా ఉన్నదని తృప్తిపడితే మృత్యువు ఎప్పుడువచ్చి మీద పడుతుందో అని భయం!

ఈ విధంగా మనుష్యునికి సమస్త విష యాల్లోనూ భయం ఉండనే ఉంటుంది. దేనిమీదా అపేక్షఅనేది లేక వైరాగ్యంగా వుంటే భయం అనేమాట దగ్గరకు రాదు. అందువల్ల వైరాగ్యమే అభయంగా ఉంటు న్నది. ఈ విషయాన్నే భర్తృహరి యిలా చెప్పాడు—

'భోగే రోగభయం కులేచ్యుతిభయం
విత్తేనృపాలాద్భయం
మానే దైన్యభయం బలే రిపుభయం
రూపే కృతాంతాద్భయమ్,
శాస్త్రే వాదభయం గుణేఖలభయం
కాయే కృతాంతాద్భయం
సర్వంవస్తు భయాన్వితం భువినృణాం
వైరాగ్యమే వాభయమ్ '

## సీరియల్




### జరిగిన కథ

కాంతారావు పెళ్ళయిన దగ్గర్నుంచి హనీమూన్‌కి వెళ్లాలనుకుంటున్నాడు. ఇద్దరు పిల్లలు కలిగినా అతని ఆ తీరలేదు. అనుకోకుండా వచ్చిన డబ్బుతో పిల్లలతోపాటు ప్రేమయాత్రకి బయల్దేరి తీరాలి అనుకున్నాడు. అతని కోరిక కళ్యాణిని మొదట్లో ఆశ్చర్యపరిచినా – ఆ ప్రయాణం ఆమెకీ ఆనందమే. బయల్దేరదామంటే బయ ల్దేరదామనుకున్నారు. రైల్లో ప్రయాణంచేస్తూ భార్యాభర్త లిద్దరూ ఆయాత్రలోని ఆనందాన్ని అనుభవిస్తున్నారు. వారి మొదటి మజిలీ తిరుపతిలో.

## 5

అక్కడ పిల్లలకి జుట్టు తీయించడం పెద్ద ప్రయత్నమయింది. ఆ వాతావరణాన్ని, మంగలికత్తిని చూసి పిల్లలు గోడుగోడున ఏడుస్తుంటే కళ్యాణికి కళ్ల నీళ్ల పర్యంతం అయింది 'ఎందుకొచ్చిన అవస్థలివి చెప్పండి? ఆ పిల్లలను అంత ఏడిపించి, జుట్టు తీయిస్తేగాని మీ దేవుడికి మనమీద దయకలగదా యేమిటి?' అన్నది భర్తతో నిష్ఠురంగా.

'అలాంటి మాటలనకు కళ్యాణీ! ఏం చేసినా మన శుభంకోసమేగా!' అన్నాడు ఆముదం తాగినవాడిలా ముఖంపెట్టి కాంతారావు. అప్పటికే ఆ తంతుతో సగం నీరసం వచ్చేసింది అతనికికూడా.

కళ్యాణి నిట్టూర్చి వోసారి చుట్టూ కలియజూసింది. ఎక్కడ చూసినా జనం. నున్నని గుండ్లతో ఆడవాళ్లు, మగవాళ్లు, చిన్నవాళ్లు, పెద్దవాళ్లు క్రిక్కిరిసి పోతున్నారు. అదంతా వో వింత సంరంభంలా ఉంది కళ్యాణికి.

ప్రతిరోజూ జనం తండోప తండాలుగా వచ్చి జుట్టు తీయించుకుని, ముడుపులు చెల్లించుకుని పోతూనేఉన్నారు. కాని దేశంలోని పాపాలకేం కొరతలేదు. నేరాలకు పరిమితిలేదు. దుఃఖానికి అంతంలేదు. ఐతే వీళ్లంతా దేనికోసం ఎగబడి వస్తున్నట్లు?

దూరతీరాలనుండి దేశం నలుమూలల నుండి ఎన్నోరకాల భాషలవాళ్లు, రకరకాల వేషాల్లో యిక్కడికివచ్చి పోతూనే ఉన్నారు. కేవలం చిత్తశుద్ధికోసం, మానసిక శాంతికోసమే వీరు వస్తున్నట్లయితే అలాటివేవీ వీళ్లు పొందుతున్న లక్షణాలే కనపట్టంలేదు వీళ్లలో.

ప్రతిమనిషిలోనూ ఏదో ఆత్రం ఏమిటో ఆలజడి ఎలాగోలా పని జరుపుకుపోదామన్న తాపత్రయమే తప్ప సిన్సియర్‌గా ఏదో తాదాత్మ్యం పొందుదామని కాని, అలౌకికానుభూతిని అనుభవంలోకి తెచ్చుకుందామని గాని వీరిలో ఒక్కరికి కూడా లేదు. ఏనూటికో కోటికో ఒకరికి అలాటి ఆలోచన ఉన్నా, ఈరకమైన వాతావరణం అందుకు ఏమాత్రం అనువుగా లేదు.

ఐనా వీళ్ల పిచ్చిగాని, మనసులోలేని దేవుడు గుడిలో ఉంటాడా?

అక్కడ ఉన్న బాత్‌రూములలో పిల్లలకు స్నానం చేయించి తాము కూడా చేసేసరికి సర్కస్ చేసినంత పనయింది ఆ దంపతులకు.

స్నానం చేసిన శరీరాలతో మట్టిలో పొర్లుతున్న పిల్లలను, వాళ్లను అదుపులో పెట్టలేక అవస్థ పడుతున్న భర్తను చూసేసరికి అప్పుడే తలారా స్నానం చేసి వచ్చిన కళ్యాణికి నవ్వూ, ఏడుపూ రెండూ వచ్చినయ్. మళ్లీ పిల్లలకి స్నానం చేయించి బట్టలు తొడిగి, దేవాలయ ప్రాంగణంలోకి వెళ్ళేసరికి దాదాపు తొమ్మిది కావస్తోంది. ఎంతత్వరగా తయారవుదామనుకున్నా, అంతకన్న ముందుగా చేరుకోలేక పోయేరు.

మొదలు, తుది తెలియకుండా ఉన్న ఆ జనప్రవాహపు 'క్యూ'ని చూస్తూనే ఎటు పోవాలో తెలియక దూరంగా నిలబడ్డారా దంపతులు పిల్లలను దగ్గరకు తీసుకుంటూ.

జన కోలాహలంతో చెవులు హోరుమంటుండగా ఎన్నడూ ఒకచోట అంతమంది జనాన్ని ఒక్కసారి చూడని పిల్లలు నోళ్లు తెరచుకుని వాళ్లవంక చూస్తూ అమ్మ నాన్నల నానుకుని నిల్చున్నారు.

వాళ్లలా ఐదునిమిషాలపాటు దిక్కుతోచక నిల్చునేసరికి యింతలో ఒకతను హడావిడిగా వారిదగ్గరకు వచ్చేడు. 'ఏమండీ! ఇక్కడ నిల్చున్నారు? ఇప్పటికే చాలా ఆలస్యం అయిపోతోంది. అబ్బబ్బ! ఏం జనమండీ, ఏం జనం! చూస్తున్నారు కదా! ఉదయం ఆరుగంటలనుండి ఎడతెగని జనం! పాపం పిల్లలుకూడా ఉన్నట్టున్నారు. ఈ క్యూలో వెళ్లాలంటే మధ్యాహ్నం పన్నెండు దాటుతుంది' అన్నాడు సానుభూతిగా.

అతనన్న చివరివాక్యం వినగానే కాంతారావు, కళ్యాణి ఒకరిమొఖం ఒకరు చూసుకున్నారు.

'మరేం ఫరవాలేదు. మీరు [illegible]

కండి. నేను దేవస్థానంలో పనిచేసేవాణ్ణే! ఆ పోలీసుల కళ్ళుగప్పి ఏలాగోలా మిమ్మల్ని క్యూ మధ్యలోకి కొంచెం త్వరగా వెళ్ళేట్టు చేస్తాను.' అన్నాడతను.

అతనివంక వొక్కక్షణం పరిశీలనగా చూసేడు కాంతారావు. అతనిదుస్తులు వాలకం అదీ చూస్తుంటే దేవస్థానంలో కూలిపనిచేసే వాళ్ళాగే ఉన్నాడు.

'ఐతే ఇప్పుడేం చెయ్యాలి?' ఆశగా అడిగేడు కాంతారావు. అప్పుడే అటుగా వస్తున్న పోలీసునుచూసి యేదో చెప్ప బోతున్నవాడల్లా చటుక్కున ఆపివేసేడు. ఆ పోలీసు అతనివంక, కాంతారావు కుటుంబంవంక వోసారిచూసి చిన్నగా నవ్వుకుంటూ వెళ్ళిపోయేడు. పోలీసుపోయిన తరువాత అతను కొంచెం స్వరంతగ్గించి 'మీరేం భయపడకండి సార్! మిమ్మల్ని గుడిలోకి పంపేభారం నాది. సరేనా? పది నిముషాలాగండి. వాళ్ళు కానరాకుండా మిమ్మల్ని క్యూలోకి పంపిస్తాను. పాపం అసలే చిన్న పిల్లలతో ఉన్నారు' అన్నాడు పాత జుబ్బా మీద చెయివేస్తూ.

'అప్పట్లు మీరిక్కడే ఉండండి. నేను పదినిమిషాల్లో తిరిగొస్తాను...' అని కొంచెం మెలికలు తిరుగుతూ 'హిహిహి... నా ఖర్చులకు ఏమైనా యిప్పించరా సార్...హిహిహి...' అన్నాడు.

కాంతారావు కళ్యాణివంక చూసేడు. 'ఛ! లంచం యివ్వటమా?' అన్నట్టు చురుక్కున చూసింది కళ్యాణి భర్తవంక.

'నీకు తెలియదులే ఉండు' అన్నట్లు కళ్ళతోనే భార్యకి నచ్చచెప్పి జేబులోనుండి రెండు రూపాయిలనుతీసి అతని కిచ్చేడు కాంతారావు.

అతడు అడబ్బు తీసుకుని 'ఇక్కడే ఉండండిసార్ మీరు. మళ్ళీ అటూ ఇటూ పోయేరంటే మిమ్మల్ని వెతుక్కోవటం కష్టమవుతుంది నాకు. టెన్ మినిట్స్‌లో వచ్చేస్తాను' అని తనకు యింగ్లీషు భాషా పరిజ్ఞానంకూడా ఉందని వాళ్ళకి తెలియ బరచి హడావిడిగా అక్కడనుండి పరుగు పెడుతున్నట్లు వెళ్ళిపోయేడా మనిషి.

కళ్యాణి యేదో అనబోతుంటే కాంతా రావు అందుకుని అన్నాడు 'ఆ క్యూవంక వోసారి చూడు కళ్యాణి! అందులో చివరన నిల్చున్నామంటే మనం గుళ్ళోకి వెళ్ళేసరికి



ఎంత [illegible] బిడవాడు ... రెండు రూపాయిలిస్తే తప్పేముంది చెప్పు. అతను చేసే సహాయానికి కృతజ్ఞతగా రెండు రూపాయిలా ఇచ్చే మనుకుందాం. లేదా ఒక పేదవాడికి దానం చేసే మనుకో!' అన్నాడు.

కళ్యాణికి తను నిస్సహాయస్థితి అర్థమైనందున చేసేది లేక మాట్లాడకుండా ముఖం పక్కకు తిప్పుకుంది. అప్పటికి కాని కళ్యాణికి తెలిసిరాలేదు. తమలానే ఆలస్యంగా వచ్చిన పిల్లలుగల తల్లిదండ్రులు ఏ పది పన్నెండు గుంపులుదాకా ఉన్నారని తమదగ్గరికి వచ్చినతనే మరొక కుటుంబం దగ్గరకు వెళ్లి మాట్లాడుతున్నాడు. అతనుకాక అతనిలాంటివాళ్లే మరో యిద్దరు, ముగ్గురు మిగతా కుటుంబాలవారితో మాట్లాడుతున్నారు. అప్పటికి పరిస్థితి కొంత అర్థమయింది కళ్యాణికి. తమలాగా పిల్లా పీచుతో వచ్చినవాళ్లు ఆ క్యూని చూసి భయపడి, అందులోకి వెళ్లే సాహసంలేక యిలా పనివాళ్లకు కొంత ముడుపు చెల్లించుకుని ఎలాగోలా గుళ్లోకి ప్రవేశించాలని చూస్తున్నారని ఆమె గ్రహించింది.

పది, ఇరవై, ముప్పై...అరవై నిమిషాలు గడిచినయ్. అంతవరకు ఆ కుటుంబాలతో మాట్లాడిన వాళ్లలో ఒక్కడుకూడా ఐపులేడు. మధ్యలో పొరపాటున అతను ఓసారి అటు వచ్చేసరికి వీళ్లను చూస్తూనే 'వచ్చేస్తున్నాను సార్! ఇప్పుడే మీకు ఏరేంజు చేయిస్తాను' అంటు పరుగెత్తుకు పోయేడు.

ఈ గంటసేపూ ఆ మనిషి అన్న ప్రకారం రాకపోగా, పిల్లలతో నానాఅవస్థ అయింది వాళ్లిద్దరికి. పాప 'జీ' పోవాలంటే దానిని రెండుఫర్లాంగుల దూరంలో ఉన్న పంపుదగ్గరకు తీసుకుపోయి కడుక్కోవలసి వచ్చింది. బాబిగాడు మంచినీళ్లు కావాలని కాసేపు, అవిస్తే బిస్కట్లు కావాలని మరి కాసేపు, అవి కూడా యిచ్చేక ఉప్మా కావాలనే యిలా మారాం చేస్తూ ఆ దంపతులకు ఊపిరాడనీయకుండా చేసేడు. పిల్లలను ఎక్కువసేపు నిల్చుండే శక్తిలేక తల్లిదండ్రులను ఎత్తుకోమన్నారు. వాళ్ళను ఎత్తుకున్నా ఎక్కువసేపు వాళ్ళు అలాగే ఎత్తుకొని నిల్చోవటం సహించలేక క్రిందకు దిగజారటం ప్రారంభించేరు. ఇలాటి అవస్థతో మరో గంట గడిచింది.

ఈ రెండు గంటలలోనూ క్యూలో నిల్చున్న మనుష్యుల గుండ్లన్నీ వరుసగా కదిలిపోతున్నాయ్—'గోవిందా! గోవిందా!' అని అరుచుకుంటూ.

ఎంత పెద్దగా కనపడుతున్నప్పటికీ ఆ క్యూ ఎంత త్వరగా కదిలిపోతోందంటే, తమకంటె ముందే ఎంతోమంది మనుషులు కదిలిపోతున్నారు. ఆలస్యంగానైనా అసలు విషయం అర్థమవటంతో, ఆ అపరిచిత వ్యక్తి చేసిన మోసాన్ని కూడా అర్థం చేసుకుని చివరకు క్యూలోనే వెళ్ళటానికి నిశ్చయించుకుని అక్కడనుండి కదిలేరు కళ్యాణి కాంతారావులు.

అప్పటికి పదకొండు గంటలు దాటుతోంది. ఆకలితో, నీరసంతో కళ్ళు తిరుగుతున్నయ్ వాళ్ళకు. అలాగే నిర్జీవంగా నిలబడ్డారు క్యూ వెనుక. భక్తులందరికీ 'క్యూ' శిక్ష చాలదా అన్నట్లు వానరమూక కూడా వాళ్ళను ఏడిపించసాగినయ్. జనం నిలబడేచోట ఉన్న దేవాలయం కప్పు మీద నిల్చున్న కోతులు ఒక్కొక్కటే చటుక్కున క్రిందకు దూకి భక్తాగ్రేసర చక్రవర్తుల హస్తాలలోనుండి దేవునికి సమర్పించటం కోసం తీసుకుపోతున్న ఫల పుష్పాది ప్రసాదాలను అమాంతం లాగేసుకుని, సుష్టుగా తింటున్నాయ్. నో పక్క తాము అంత భక్తితో డబ్బు ఖర్చు పెట్టి కొన్న దైవ ప్రసాదాన్ని కోతులెత్తుకుపోయినాయని కడుపు మంటగా ఉన్నా వెంటనే అలా దైవప్రసాదాన్ని కోతులెత్తుకు పోవటం శుభలక్షణమని సరిపెట్టుకున్నారు 'వేంకటేశ్వర స్వామికి బదులు, ఆంజనేయస్వామికి సమర్పించేం అనుకుందాం' అంటూ సమాధానం చెప్పుకుని వట్టిచేతులోనే ముందుకు నడచేరు. ఎందుకంటే మళ్లీ ప్రసాదాన్ని కొనటానికి కనుక వాళ్ళు బయటకు వెళ్లేరంటే తిరిగి దైవదర్శనం చేసుకునేప్పటికి పునర్జన్మ ఎత్తవలసి వస్తుందని వాళ్లకు తెలుసు

క్యూలో నిల్చుని ఓసారి వెనుక్కితిరిగి చూసింది కళ్యాణి. ఆమె వెనుక అంతకు ముందు ఆ మనుషులకు ముడుపులు చెల్లించి క్యూలో కాకుండా అడ్డదారిన దైవదర్శనం చేసుకోవటానికి తమతో పాటు ఆత్రపడిన కుటుంబాలవారు కూడా ఉన్నారు. అందులో ఒకామె కళ్యాణిని చూస్తూనే నీరసంగా నవ్వింది. కళ్యాణికి కూడా నవ్వు వచ్చింది.

ఆ నవ్వులో 'చూసేరా! ఆ వెధవలు ఎంత మోసంచేసేరో !' అన్న కసీ ఉంది. ఆ మోసానికి లొంగిపోయిన తమ తెలివి తక్కువతనానికి పొందే సిగ్గూ ఉంది. క్యూ కదులుతోంది మెల్లగా—చాలా మెల్లగా భారతదేశపు పంచవర్ష ప్రణాళికల ఫలితాలలా, సగటు మానవుడి జీవనప్రమాణంలా, నేటి యువతరంలోని అభ్యుదయ భావాల్లా, నవమాసాలు నిండిన గర్భిణీ స్త్రీలా, వర్షాకాలంలో మందంగా ప్రవహించే మూసీనదిలా...ఏ ఉపమానమైనా చెప్పుకోవచ్చు దూరంగా నిలబడి ఆ క్యూని చూస్తున్నవారు. కాని నిజంగా ఆ క్యూలో నిలబడ్డవారి ప్రాణాలు మాత్రం గాలిలో తేలిపోతున్నాయ్. కడుపులో కరకరమనే ఆకలి. దైవదర్శనం ఎప్పుడో అన్న ఆత్రం, పిల్లల ఏడ్పులు, పెడబొబ్బలు. వీళ్లందరినీ ఊరిస్తూ ఒకతను పెద్ద బుట్టలో ఎర్రగా కాలిన పడలను అమ్ముతున్నాడు. పెద్దవాళ్లందరికీ వాటిని చూస్తుంటే నోరూరుతున్నా, దైవదర్శనం చేస్తేతప్ప యేమీ తినకూడదు కనుక ఆ నీటిని మింగేసి, దాహం తీర్చుకొని పిల్లలకు మాత్రం కొనిచ్చేరు. కళ్యాణికూడా పిల్లలిద్దరికీ చెరొకటి కొనిచ్చింది. దాంతో కొన్ని నిమిషాలపాటు పిల్లలఏడుపు సర్దు మణిగింది.

కాంతారావుకీ, కళ్యాణికీ కాళ్లు పీక్కుపోతున్నాయ్—మూడు గంటలనుండి నిల్చుని ఉండటంవల్ల కోతులెక్కడ ఎత్తుకుపోతాయోనని కళ్యాణి కొబ్బరికాయను అరటిపళ్లను చీర చెంగుచాటున దాచేసుకొంది. నడుస్తోంది క్యూ, మెల్లగా అతి మెల్లగా...ఐతే ఎంతమెల్లగా నడచినప్పటికీ మొత్తానికి దేవాలయంలోకి గంటలోగానే ప్రవేశించారు. ఆ విషయం కాంతారావునీ కళ్యాణినీ మాత్రమేకాక వారిలాగే మోసపోయిన మిగతా కుటుంబాల వాళ్లనికూడా ఆశ్చర్యపరచింది. చూట్టానికి పెద్దగా కనబడుతున్నప్పటికి ఆ క్యూని క్రమబద్ధంగా స్కీముప్రకారం నడిపించడం వల్ల ఒక గంట అటూ ఇటూ క్యూ

ప్రశ్నలని 'ప్రశ్నావళి', ఆంధ్ర సచిత్ర వారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1 కి పంపాలి.








# పిల్లలతో ప్రేమయాత్ర

వెనుకనున్న మనిషి దైవదర్శనం చేసుకో వచ్చు.

ఈ విషయం తెలియక అనవసరంగా ముక్కూ మొహం తెలియని వాళ్ళ మొహాన డబ్బుపారేసి పైగా రెండుగంటల పాటు ఎండలో నిల్చున్న తమ బుద్ధిహీనతను తలుచుకుని 'ఈసారి తిరుపతి వచ్చినప్పుడు అంత బుద్ధితక్కువపని చస్తే చెయ్య కూడదు' అని అందరూ గట్టిగా లెంపలు వాయించుకున్నారు.

క్యూలో నిలబడటం ఒకతంతు దేవాలయంలోకి ప్రవేశించేక ఆ గర్భగుడిలోని గందరగోళం మరొకతంతు. కొబ్బరి కాయలను దేవుడిముందు కొట్టటానికి వీల్లేదట. గర్భగుడికి బయటనేకొట్టి లోపలికి ప్రవేశించాలి. 'ఆ మాత్రానికి మనయింటిదగ్గరే కొట్టుకోవచ్చుగా!' అనుకుంది కళ్యాణి.

వెలుగులోనుండి ఒక్కసారిగా గర్భ గుడిలోకి ప్రవేశించేసరికి కళ్లకు యేమీ కనపడ లేదు. దాంతో పిల్లలిద్దరూ ఏడుపు లంకించుకున్నారు. వాళ్లనోళ్ళు మూసి తడుముకుంటూ ప్రదక్షిణ ప్రారంభించేరు. ఒకేఒక ప్రదక్షిణం చేయాలి. కుడివైపు నుండి మొదలుపెట్టి మధ్యలో మందస్మిత వదనారవిందుడైన శ్రీనివాసుని సందర్శించి, ఆపైన ఎడమవైపుగా తిరిగి బయటకు వచ్చేయాలి. దైవం వైపుగా ప్రయాణం చేస్తున్న వారిలో ఉత్సాహోద్రేకాలు మిన్నుముట్టుతున్నయ్. 'గోవిందా! గోవిందా!' అని భక్తి పారవశ్యంతో కేకలుపెడ్తూ దైవాన్ని సమీపించేరు. కాని అంత కష్టపడి వచ్చి దైవ సమక్షంలో నిలబడేసరికి పూజారి ఒక్క క్షణం కూడా వాళ్ళను నిలబడనీయకుండా 'యింకా పదండి, పదండి' అని వాళ్ళను తోసేస్తున్నాడు. కొందరు మహా భక్తులు తాము తెలుగు సినిమాల్లో చూసే వెంకటేశ్వరస్వామి యీయనా కాదా అని పరీక్షించదలచుకుని మరో రెండు నిమిషాలపాటు మొండికెత్తి నిలబడి చూస్తుంటే పూజారి వాళ్ళను పశువులను అదలించినట్లు అదిలించి ఒక్క తోపుతో ముందుకు పంపేడు. తమలోని నిరాశను కప్పిపుచ్చుకునేందుకు ఆ మూడవతరగతి భక్తులు (మొదటి, రెండవ తరగతి భక్తులు 'డబ్బు' కట్టి దేవుడిని ఎక్కువసేపు చూడవచ్చు) వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ 'గోవిందా, గోవిందా!' అనుకుంటూ బయటకు వచ్చేసేరు.

'దేవుడు వరమిచ్చినా పూజారి వరమీయడని అందుకే అంటారు కాబోలు' అనుకుంది కళ్యాణి.

కాంతారావు యేమీ అనుకోలేదు కాని, అతని మనసు మాత్రం యేదో వెలితిగా ఉన్నట్లనిపించింది.

అతను ఎంయే. పరీక్ష బెనారస్‌లో వ్రాసేడు. కాశీ విశ్వేశ్వరుని దేవాలయంలో కూడా యిదే తంతు. ఇంకా యిక్కడి పూజారులు నయం. కాశీలో అయితే అడుగడుక్కీ 'హో నల్లరాతినో, బొమ్మనో పెట్టుకుని పండాలు (పూజారులు) కూర్చుని వచ్చిన భక్తులందరినీ డబ్బులేసే దాకా పీక్కుతింటారు. విశ్వనాథుని చూసి మళ్ళీ దేవాలయంలోనుండి బయటపడేసరికి కనీసం వో పాతికమంది పండాలకయినా ముడుపు చెల్లించుకోక తప్పదు. ఆ తంతంతా చూస్తుంటే ఎంత భక్తుడికైనా 'వీరు పండాలా, గూండాలా?' అన్న ప్రశ్న జనించక మానదు. ఆఖరికి దైవ కార్యాలు కూడా యింత అల్పంగా తయారయినాయంటే యేమనుకోవాలి? ఈ కాలంలో పుణ్యక్షేత్రాలన్నీ వ్యాపార స్థలాల్లా ఉంటున్నాయే తప్ప మనశ్శాంతిని, ఆత్మవికాసాన్ని కలిగించే వాతావరణమే ఉండటం లేదు అక్కడ.

దీనికి కారణం మరేం లేదు. ఇలాటి పుణ్యక్షేత్రాలకు వచ్చే వాళ్ళలో నూటికి తొంభైమంది మనశ్శాంతి కోసంకాక పాప పరిష్కారంకోసం వస్తున్నారు. అందుకే దేవాలయాల్లోని దైవం వట్టి రాతి విగ్రహంగానే మిగిలిపోతున్నాడు. మానవుల హృదయాల్లోని దైవత్వం ఎప్పుడు నశించిపోతుందో అప్పుడు దేవాలయాలకు విలువే ఉండదు.

గర్భగుడిలోనుండి బయటకు వచ్చేసరికి అందరి శరీరాలు చెమటతో తడిసి ముద్దయిపోయినయ్. గర్భగుడిలో వారు పొందలేని ఆత్మశాంతికి ప్రతిగా కడుపు శాంతికోసం ప్రతి భక్తుడికీ ఆకులనిండా పులిహోర, దద్ధోజనం పంచి పెడుతున్నారు ఉచితంగా దేవాలయం ఎదురుగా. వాటిని తీసుకుని బయటకు వెళ్లి, తిని కడుపు నింపుకున్నారు. అప్పటికి ఒంటిగంట కావస్తోంది. అప్పుడు హోటలుకి వెళ్ళి భోజనం చేసి

పిల్లలకు పాలు ఫ్లాస్కుల్లో పోయించుకుని తమ కాటేజీకి తిరిగివెళ్లేరు. వో గంట పిల్లలను నిద్రపుచ్చి తాము కూడా విశ్రాంతి తీసుకున్నారు కళ్యాణి, కాంతారావులు.

ఇంతలో పక్క కాటేజిలో ఉన్న ఒకా యన వాళ్ళ దగ్గరకు పరుగెత్తుకుంటూ వచ్చేడు. 'విన్నారాండీ యీ వార్త! ఎంత ఘోరం! ఎంత అపచారం! కలికాలం!' అంటూ లొప్పుతూ ఒకటే అంటున్నా డాయన.

ఆయన అరుపులకు పిల్లలెక్కడ లేస్తారోనని కాంతారావు కళ్యాణి యిద్దరూ బయటకు వరండాలోకి వచ్చి 'యేమయిం దండీ?' అనడిగేరు.

'ఇంకా యేమవ్వాలండీ! ప్రళయం వచ్చేస్తోంది. కలియుగం అంతం కాబో తోంది. అందుకే యీ పాపాలన్నీ యిలా రోజురోజుకీ పెరిగిపోతున్నయ్' ఆయాస పడ్డాడా ముసలాయన.

'ఇంతకూ యేం జరిగిందో చెప్పేరు కాదు.' అన్నాడు కాంతారావు.

'ఇంకా యీ వార్త మీ చెవులదాకా రానేలేదటండీ! తిరుపతి వేంకటేశ్వర స్వామి వారి హుండీలోని డబ్బుల్లో పదివేల రొఖ్ఖం తక్కువయినయ్‌ట. విన్న భక్తులంతా పోయిన తరువాత డబ్బు లెక్కకట్టుకుంటూంటే పదివేలు తక్కు వైనట్టు తెలిసిందట. అంతా ఒకటేగోల. అన్నట్టు కాజేసినవానిని అరెస్టుచేసేరట వివరాలింకా తేల్లేదనుకోండి. అయినా యిదేం పొయ్యేకాలమండీ! స్వామివారి హుండీలోని డబ్బు కాజేయటానికి వాడికి ఎన్నిగుండెలుండి ఉండాలి? ఎన్నిగుండె లుండి ఉండాలి?' అంటూ తనగుండె బాదుకున్నాడాయన.

కళ్యాణికి నవ్వొచ్చింది.

తిరుపతి వేంకటేశ్వరస్వామిని నిలబెట్టి యిలా అడగాలనిపించింది ఆమెకు. 'వో ప్రభూ! ఎక్కడున్నావు నువ్వు? మండు టెండలో కాళ్ళు చచ్చుబడేలా క్యూలో నిలబడి నీ దర్శనంకోసం పడిగాపులుకాసే యీ సామాన్య ప్రజలలోనా? అమాయకు లైన భక్తులను మోసపుచ్చి, అడ్డదారిన వారికి దైవాన్ని చూపిస్తానని నమ్మించి డబ్బు గుంజుకున్న పనివాళ్లలోనా? వాళ్ళు చేసే ఘాతుక కృత్యాలను చూసికూడా వాటిని అరికట్టవలసిన బాధ్యత తమకున్న దన్న సంగతిని విస్మరించి 'వాటా' కోసం కక్కుర్తిపడి ఏమీ ఎరగనట్లు వెళ్లిపోయే ఈ రక్షణశాఖలోనా? కరకరమని మండు తున్న కడుపులతో క్యూలో నిలబడిన భక్తులకు నోరూరిస్తున్న వేడి వేడి గారెలలో ఉన్నావా? లేక దైవంకోసం కొన్న ప్రసాదాన్ని ఎత్తుకుపోయి పళ్లికిలిస్తూ తినే ఆ వానర మూకల్లో ఉన్నావా? భక్తులను పశువుల్లా అదిలించే ఆ పూజారుల లోనా? లేక దైవంకోసం భక్తులు సమ ర్పించుకున్న ముడుపుల తాలూకు పైకాన్ని మింగేయగలిగిన వారిలోనా చెప్పు ప్రభూ! చెప్పు! వీటిలో ఎక్కడున్నావు నువ్వు?' అని.

సరీగా అదే సమయంలో కళ్యాణికి గీతాకారుడు తన 'ఉనికి'ని గూర్చి చెప్పిన వాక్యాలు స్ఫురణకి వచ్చినయ్ 'వో అర్జునా! నేను ఎక్కడైనా ఉంటాను. అంతటా వ్యాపించి ఉంటాను. అందరిలోనూ ఉంటాను, సజ్జనుని మంచితనాన్ని నేను; దుర్జనుని దుర్మార్గాన్ని నేను. వంచకుని మోసాన్ని నేను. జూదరిలోని జూదాన్ని నేను. భక్తుడిలోని భక్తిని నేను, నాస్తి కుడిలోని నాస్తికతను నేను. ఈ విశ్వంలో నేనులేని అణువేలేదు. ఈ విశ్వమే నేను. నేనే ఈవిశ్వాన్ని' యించుమించుగా. ఆ వాక్యాల సారాంశం అది.

కళ్యాణి అనుకుంది అప్పుడు మన స్ఫూర్తిగా 'ఓ స్వామీ! నువ్వు సర్వాం తర్యామివి. అందులో సందేహంలేదు' అని.

* * *

ఆ సాయంత్రం పాపనాశనం, ఆకాశ గంగ చూట్టానికి వెళ్లేరు. అక్కడికి వెళ్లేందుకు టాక్సీలు సిద్ధంగా స్టాండులో నిలబడి ఉన్నా, టాక్సీవాళ్లు మాత్రం యాత్రికులను ఆ ప్రదేశాలకు తీసుకు పోవటానికి అంతసిద్ధంగా లేరు. గీచిగీచి బేరమాడి రెండురూపాయల దూరానికి పన్నెండు రూపాయలు చేతిలో పడితేగాని కదలమని కూర్చున్నారు. 'పోనీలే మనం యాత్రలకు వచ్చింది డబ్బు ఖర్చుపెట్ట టానికి కదా' అని సరిపెట్టుకుని వాళ్లడిగి నంత డబ్బు యివ్వటానికి కాంతారావు సిద్ధమయినా 'మరో ముగ్గురు మనుషు లన్నా—అంటే కనీసం 'ఐదుగురు మనుషు లన్నా ఉండందే టాక్సిని యిక్కడనుండి చస్తే కదిలించను' అన్నట్టు భీష్మించు కున్నాడు.



మరోముగ్గురు మనుషులను తనతో రమ్మని బ్రతిమాలటానికి వేట ప్రారంభించేడు కాంతారావు. ఎలాగో వో కుటుంబం కలిసింది. టాక్సీకదిలింది.

తుప్పలను, పొదలను దాటుకుంటూ ఎగుడుదిగుడు రోడ్డుమీదుగా టాక్సీ కదలిపోతుంటే కళ్యాణికి మళ్లీ ప్రాణం వొచ్చినట్టుగా ఉంది. ప్రయాణం అంటే కళ్యాణికి చాలా యిష్టం. వేగంగా నడచే కారులో కూర్చుని దూసుకుపోతూన్న చెట్లను, పుట్లను, కొండలను దాటి ఎక్కడికో గమ్యం తెలియని ప్రదేశాల లోనికి, ఎన్నిటికీ అంతంకాని యాత్రలో జీవితాన్ని గడపేయా లనిపిస్తుం దామెకు. ముఖ్యంగా ఆ ప్రయాణం జనసందోహానికి దూరంగా ఉంటే మరీ యిష్టం. ఆ ప్రయాణం పచ్చని చేల మధ్యగా గాని, మహావృక్షాల మధ్యగాని, ఆఖరికి ముళ్ల కంచెల మధ్యనైనా సరే... అది మానవ కల్పితమైన వాతావరణం కాకపోతే అంతే చాలు ఆమెకు. సహజమైన ప్రకృతి యే రూపంలో ఉన్నా ఆమె కంటికి మనోహరంగానే కనిపిస్తుంది. ఆకులురాలి, కొమ్మలు విరిగి, మొద్దులా నిలబడిన ఎండిన మ్రానుకూడా ఆమెకు కళాత్మకంగానే ఉంటుంది. కారణం మరేంలేదు. ప్రకృతిలో సహజత్వం ఉంది. మనుషులలో కృత్రిమత్వం — నటన ఉంటయ్. అందుకే ఎక్కువ సమయం మనుషులమధ్యకన్నా ప్రకృతితోనే గడిపేస్తే బాగుంటుందనిపిస్తుంది. కాని అలాటి అవకాశం నాగరిక ప్రపంచంలో యాంత్రికంగా బ్రతుకుతున్న తనకి సాధ్యంకాదు. అందుకే ప్రతిమనిషికి, ప్రతికుటుంబానికీ జీవితంలో తరచుగా యిలాంటి యాత్రలు చెయ్యవలసిన అవసరం చాలావుంది.

పుణ్యయాత్ర పేరుతోగాని, ప్రేమయాత్ర పేరుతోగాని కనీసం ఏడాదికో సారన్నా ప్రతిమనిషి రొటీన్ జీవితాన్నుండి తాత్కాలికంగా తప్పించుకుని ప్రకృతి దృశ్యాలను ప్రాచీన కళా ఖండాలనుచూసి కొంతలో కొంత మానసికశాంతి పొందవచ్చు. ఇలాటి ప్రయాణాలు ఆలోచనలను విస్తృతపరుస్తాయ్, హృదయాన్ని స్పందింపజేస్తయ్.

# పిల్లలతో ప్రేమయాత్ర

కళ్యాణికి చాలా నిరాశకలిగించేలా, ఆమె ఆలోచనలకు బ్రేక్‌వేస్తూ టాక్సీ చాలా తక్కువటైములోనే 'ఆకాశగంగ' దగ్గర ఆగింది. టాక్సీ ఆగినచోటుకు, గమ్యస్థలానికి మధ్యదూరం కొంచెం ఎక్కువే ఉండటంవల్ల వాళ్లు నడచేవెళ్లాలి. కాని ఎగుడు దిగుడుగా ఉన్న ఆ ప్రదేశంలో పాపనెత్తుకుని నడుస్తూఉన్నా ఆమెకు అలసట అనేది అనిపించలేదు. బూడిద రంగులోఉన్న నేల, అక్కడక్కడ రాళ్లు రప్పలు తుమ్మపొదలు, అన్నీ ఎంతో సహజంగా, అత్యంత ప్రియంగాఉన్నాయ్ ఆమెకు. ఆ ప్రదేశంలో నడుస్తూంటే ఏదోఒక నూతన ప్రపంచంలోకి అడుగు పెట్టుతున్నట్లు అనుభూతి కలుగుతోంది.

కొన్ని నిమిషాలలో 'ఆకాశగంగ' దగ్గరకు వచ్చేరు. పేరుకుతగ్గట్టు అక్కడ గంగా ప్రవాహమేమీ లేదు. ఎత్తైన గుట్ట ఒకటి, మూడు గోడలతో గుహలాగా కనిపిస్తోంది. అందులో ఒకవైపునుండి సన్ననిధారగా నీళ్లు పడుతున్నాయ్. క్రింద పడి చిన్న నీళ్లగుంటలా ఉన్న ఆ ప్రవాహంలో అందరూ కాళ్లు కడుక్కున్నారు. గుహలాగాఉన్న ఆ గుట్టను దూరంనుండి చూస్తే వో చిన్నసైజు లోయలా ఉంది. అక్కడ ఒక బ్రాహ్మణుడు కూర్చుని ఏదో విగ్రహాన్ని పెట్టుకుని పూజ చేస్తున్నాడు. భక్తులందరూ ఆ నీళ్లలో నుండి నడచివెళ్లి కొబ్బరికాయలు, పళ్లు, పూలు, పైసలు ఆ బ్రాహ్మణుడికి సమర్పించుకుని వస్తున్నారు. కళ్యాణికి చీరపైకెత్తుకుని నీళ్లలో నడచి వెళ్లటానికి సిగ్గనిపించి యివతలగానే నిలబడింది పిల్లలతో. కాంతారావు పాంటు పైకి—మడచుకుని వెళ్లి వో పదిపైసలు దేవుడికి సమర్పించి, కుంకం, పూలు తీసుకువచ్చేడు.

ఆ ప్రదేశం, ఏకాంతంగా ఊరికి దూరంగా ఉన్న 'ఆకాశగంగ' దృశ్యం చాలా మనోహరంగా ఉంది. చుట్టూ దట్టమైన చెట్లు, పచ్చగా నిండుగా యాత్రికులకు కనులపండువ చేస్తున్నయ్. వాటిపైన సంధ్యారుణ కాంతులతో వెలిగిపోతున్న ఆకాశం. సన్నగా పడుతున్న నీటిధార... చిన్నసైజు లోయలా కనపడుతున్న ఆ గుట్ట, దానిమీద బ్రాహ్మణుడు ...అన్నీ ఎంతో వింతగా ఉన్నయ్. ఈ భక్తులెవ్వరూ లేకుండా, ఆఖరికి తన భర్తని పిల్లలను కూడా వదిలి కొంతసేపు ఆ బండరాళ్లమీద ఏకాంతంగా, సోమరిగా కలలుకంటూ, గాలికి ఊగే ఆకుల చిరుసవ్వడిని వింటూ, చల్లనిపిల్లవాయువులతో శరీరాన్ని నింపుకుని మౌనంగా ఉండిపోవాలనిపించింది కళ్యాణికి.

ఉదయం 'క్యూ'లో నిలబడి నానా అవస్థలూ పడి శరీరాన్ని మనసునీ హూనం చేసుకుని ఆ దైవాన్ని సందర్శించి వప్పటికన్న యీ పచ్చని ప్రకృతి మధ్య జనసమూహంలేని యీ ప్రదేశంలో ఏకాంతంగా నిల్చుంటే ఎంతో ప్రశాంతత కలుగుతోంది మనసులో ఎందుకో!

'ఏమిటలా పరధ్యానంగా నిలబడ్డావు? ఔన్లే! ఈ ప్రదేశం నీకు నచ్చటంలో ఆశ్చర్యంలేదు. కొంపతీసి యింటికి వెళ్లగానే మళ్లీ కవిత్వం వ్రాయవు కదా?' అన్నాడు పరిహాసంగా కాంతారావు.

ఆలోచలనుండి తేరుకుని చురుక్కున చూసింది భర్తవంక కళ్యాణి. 'నాముఖానికి తోడు కవిత్వం వ్రాయటం కూడానా! మిమ్మల్ని చేసుకున్ననాడే నాలోని కవితాశక్తి చచ్చిపోయింది. ఈ పిల్లలు సంసార జంజాటంలో కవిత్వం సంగతటుంచి... ఈమూడు సంవత్సరాల్లోనూ గట్టిగా ఊపిరి పీల్చుకునే సమయమైనా లభించ లేదు నాకు. అందుకే అరుదుగా లభించిన ఈ అవకాశాన్ని జారవిడుచుకోవటం యిష్టం లేక కాసేపు ఒంటరిగా సర్వంమరచి నిల్చున్నాను.' అంది అలా అంటుంటే కళ్యాణి కళ్లు ఆర్ద్రమయినయ్.

కాంతారావు మనసుకు ముల్లుగుచ్చుకున్నట్లయింది. కళ్యాణిమాటలు వింటుంటే 'మిమ్మల్ని చేసుకున్ననాడే నాలోని కవితాశక్తి చచ్చిపోయింది' అన్న వాక్యం మరింత లోతుగా దూసుకుని బాధించింది అతనిని.

(ఇంకా ఉంది)

# వారఫలం

**17-12-1971 శుక్రవారం మొదలు**
**23-12-1971 గురువారం వరకు**

**మేషం:** అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరతాయి. మిత్రులకు సహాయం చేస్తారు. పాటివారిలో గౌరవం బాగా ఉంటుంది. ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— సంతోషకరమైన వార్తలను వింటారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**వృషభం:** మీతాలూకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. వారం మధ్యలో వృత్తిలో నూతనావకాశాల్ని లభిస్తాయి. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మిథునం:** ప్రయత్నించిన ప్రతి పని సులువుగా నెరవేరగలదు. పాటివారిలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం ఆఖరులో తిరిగి అనుకూల పరిస్థితి యేర్పడుతుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**కర్కాటకం:** వృత్తిలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. పాటివారితో మాట పట్టింపులు తగవు. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాల్ బాగుంటాయి. వారం ఆఖరులో ఆందోళన కలుగుతుంది.

స్త్రీలకు:— దైవకార్యాలు నెరవేరతాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**సింహం:** వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు బాగుంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ఆడంబరం కోసం వ్యయం చేస్తారు. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి.

స్త్రీలకు:— వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు. పాటివారిలో గౌరవం లభిస్తుంది.

**కన్య:** ఆర్థిక వ్యవహారాల్లో మొగమాటాలు తగవు. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాహసము కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. ఏ వ్యవహారంలోను యితరుల మీద ఆధారపడడం తగదు.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**తుల:** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. కొన్ని వ్యవహారాల్లో ఆదావుడి అధికంగా ఉంటుంది. వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి.

స్త్రీలకు:— ప్రయాణాలోచనలు చేస్తారు. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

**వృశ్చికం:** అన్ని వ్యవహారాల్లోను మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుంది. రావలసిన డబ్బు సమయానికి అందగలదు. వృత్తిలో పోటి వారిపోటీ తగ్గుతుంది. మిత్రులకు సహాయం చేస్తారు. వారం ఆఖరులో మీ ప్రయత్నాలు శ్రమమీద ఫలిస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**ధనుస్సు:** వ్యాపారంలో ఆదాయం బాగుంటుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. నూతన విషయాలను తెల్సుకొంటారు. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మకరం:** లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. నూతన వ్యవహారాలు బాగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగా ఉండదు. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**కుంభం:** వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. వారం మధ్యలో సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వ్యాపారంలో శ్రమ కలుగుతుంది. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగుతుంది. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**మీనం:** అన్ని వ్యవహారాల్లోను గౌరవం లభిస్తుంది. స్థిరాస్తి వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. వారం ఆఖరులో ప్రయాస మీద ప్రయోజనం మంగళకరిది కాగలదు.

స్త్రీలకు:— బంధువులకు సహాయం చేస్తారు. అధిక వ్యయం జరుగుతుంది.

—మహేష్



**శశిరేఖ:**

ఈరోజు నాకెంతో ఆనందంగా ఉంది — కారణం? —

ఒకటి... ప్రసాదు దగ్గరినుండి వచ్చిన ఉత్తరం.

రెండు... రక్షణనిధి సేకరణకై మేము ప్రదర్శించిన నాటిక... అంచనాలను మించి నిధి సేకరణ— హా... నిజంగా నేడెంతో సుదినం.

నాటిక ప్రదర్శనానంతరం... నా క్లాసు




మెప్పు పొగడ్తలు... యువకులు నన్నభినందించేందుకు పడిన తాపత్రయం ... ఆ క్షణంలో ఏదో తెలియని ఆవేశం ... ఆనందం... ఎంతో కష్టంమీద అందరినీ తప్పించుకొని బయటపడ్డాను... ఒక గంట తర్వాత, కారులో కూర్చొని బరువుగా శ్వాస పీల్చాను.

కారును ట్యాంకు బండుమీదుగా యింటి వైపు మళ్ళించమని డ్రైవరుకు చెప్పాను. అంతే... ఇంటికి చేరాక నాన్నగారు తట్టి లేపేంతవరకు నేను ఈ లోకంలో లేను. నాన్నగారు ... అవును. అమ్మ గుర్తు తెలియదు. ఎంత ఆప్యాయత ? ఎంత ఆదరణ; నాకోసం రాత్రి ఒంటిగంట వరకు కాచుకుని ఉన్నారు కారులో నిద్ర పోతున్న నన్ను తట్టి లేపారు.

'అమ్మాయిగారూ! కాఫీ...',

'......................'

'అమ్మాయిగారూ!'

'......................'

'లేవండమ్మాయిగారూ ! చూడండి ఎంత పొద్దుపోయిందో?'

## మనవి

*ఈ నవలలో ఐదు ముఖ్య పాత్రలున్నాయి. ఆ ఐదు ముఖ్య పాత్రలూ ఒకటి తర్వాత ఒక టిగా తమ తమ పురుషలలో వంశాషిస్తాయి. గమనించ ప్రార్థన...*

—రచయిత

నా ఆలోచనలకు అంతరాయం కలిగింది. మెల్లిగా దుప్పటి తొలిగించి చూశాను. సీతమ్మ — చిరునవ్వుతో — ట్రేలో కాఫీ కప్పుతో—

'ఇంత పొద్దెక్కిందికదమ్మా...! ఇంకా నిద్దురోతున్నా రేంటి?'

'మెళుకువ వచ్చి అరగం టైంది సీతమ్మా...! లేవబుద్ధి వేయడంలేదు. ఒళ్ళంతా బద్ధకంగా ఉంది.'

మెల్లిగాలేచి వాష్ బేసిన్ వైపుకు అడుగులు వేశాను. 'పిచ్చిపిల్ల' అన్న మాటలు చెవినపడ్డాయి. సీతమ్మ క్రిందకు దిగి వెళ్ళిపోవడం కనుపించింది.

కాఫీ త్రాగి, దుస్తులు మార్చుకొని నేనూ క్రిందికి వెళ్ళాను.. నాన్నగారు ఎవరో స్నేహితులతో మాట్లాడుతున్నారు. నన్ను చూడగానే 'అమ్మా...! యి

కూర్చో' సోఫా చూపించారు.

నాన్నగారి స్నేహితులు నే ప్రదర్శించిన నాటికను నా నటనను మెచ్చుకోవడం... నేను థ్యాంక్సు చెప్పగానే శలవు తీసుకొని వెళ్ళడం జరిగింది.

'చాలా సేపైందమ్మా వారొచ్చి...! అందుకే 'సీతమ్మనువంపి నిన్ను లేపమన్నాను నీకేమైనా యిబ్బంది కలిగిందా?'

'లేదు నాన్నారూ...! ఇప్పటికే చాలా ఆలస్యంగా లేచాను.'

టేబులుపై ఉన్న డక్కన్ క్రానికలు తీసి చదవ నారంభించాను. అన్నీ యుద్ధ వార్తలే. పూర్తిగా చదివి బల్లపై ఉంచేశాను.

'నీళ్ళు తోడాను. స్నానానికి రండమ్మాయి గారూ!'

సీతమ్మ పిలుపుతో బాతురూమువైపు నడిచాను. స్నానం ముగించి నాన్నగారితో ఫలహారానికి కూర్చున్నాను.

'ఏమమ్మా! అలా మౌనంగా ఉన్నావేం? నీలో యిదివరకటి చురుకుదనం కనుపించడంలేదు. కారణం...ప్రసాదు లేక పోవడమా? పిచ్చితల్లి—త్వరలోనే తిరిగి వస్తాడమ్మా! ఎందుకంత బెంగ?'

'అదేంలేదు నాన్నారూ...నాకు బెంగేమిటి?'

చిరునవ్వుతో తప్పుకోచూశాను.

'పెదబాబుగారూ! చిన్న బాబుగారు యుద్ధప్రాంతాలకు పోయిన దగ్గరనుండి అమ్మాయిగారు యిలా అయ్యారండి. ఆ చిలిపితనం...హుషారు మచ్చుకైనా లేవు.'

మంచినీళ్ళు గ్లాసుల్లో నింపుతూ అంది సీతమ్మ—

'అంతా ఉత్తదే నాన్నారూ...! అదేమీ కాదు.'

'అతని విషయంలో ఎందుకమ్మా అంత బెంగ? కులాసాగ ఉన్నాడు కదా!'

'..................'

సిగ్గుపడుతూ లేచి నాగదివైపు నడిచాను—

'అమ్మాయిగారికి, చినబాబుగారికి ఆ మూడుముళ్ళూ వేయించండి బాబూ! ఆ తర్వాత నేనేమైనా ఫర్వాలేదు'

'అలాగే సీతమ్మా...! ప్రసాదు తిరిగి రాగానే ఆపని కాస్తా పూర్తిచేస్తాను.'

ఆ మాటలు విన్న నా హృదయం కల

# గూడుచేరిన పక్షులు

వరపడింది సంతోషంతో—సీతమ్మ ఎవరో...? నా చిన్నతనంలో నాన్నగారు ఆమెను చూపిస్తూ 'మనింట్లోనే ఉంటుంది తల్లీ—నీకు తోడుగా' అన్నారు. ఎవరు? ఏమిటి? అని ప్రశ్నించలేదు నేను. ఫలానా అని చెప్పలేదు నాన్నగారు. సీతమ్మ సార్థక నామధేయురాలు. నాపై ప్రసాదుపై ఎంత ప్రేమ? ఎంత ఆదరణ? ఇద్దరమూ మా తల్లులులేని లోటును మరచిపోయాము. అందరూ ఆమెను గౌరవిస్తారు. ఆమె అందరినీ ప్రేమతో చూస్తుంది.

ప్రసాదుపైగల తీయని తలపులతో ఆరోజంతా మధురంగా గడిచిపోయింది. స్నేహితురాళ్ళ బలవంతంవల్ల సినిమాకు బయలుదేరాను. సినిమాకురానని ఎంతగానో మొండికెత్తాను. ఎంత ప్రయత్నించినా తప్పుకోలేకపోయాను. బలవంతం చేశారు. దెప్పారు. తప్పేదిలేక చివరకు బయలుదేరాను.

న్యూస్‌రీలు ప్రారంభించారు —

నాకు సినిమా చూడడానికి మనస్కరించడంలేదు. నా మనసు పరిపరి విధాల పరిభ్రమిస్తూ వేగంగా గతంలోకి దారి తీసింది.

ఒకరోజు నేను మొదటిసారిగా ప్రసాదుతో సినిమాకు వచ్చాను. నేను మొదటి సంవత్సరం ప్రసాదు మూడవ సంవత్సరం మెడిసిన్‌లో ఉన్నాం.

'ప్రసాద్! సినిమాకు వెడదాం; త్వరగా తెములు' రక్తప్రసరణ మండలాన్ని తదేకంగా గీస్తున్న ప్రసాద్ కళ్ళల్లోకి ఆశగా చూస్తూ చనువుతో ఆజ్ఞాపించాను.

'లేదండమ్మాయిగారూ! మీరు వెళ్ళి రండి. రేపటి నా కాలేజి స్టడీస్ చాలా మిగిలి ఉన్నాయి' నావంక చూడకుండానే సమాధానం చెప్పాడు ప్రసాదు.

'అదేమీ కుదరదు. నీ యీ స్టడీస్ రోజూవుండేవే. ఈరోజు నా కోరిక తప్పకుండా తీర్చాలి. తప్పించుకోవడానికి ప్రయత్నించవద్దు — ఏమంటావ్ ?'

'అమ్మాయిగారూ! నన్ను క్షమించాలి... ఈరోజు రాలేను.' తన పనిలో నిమగ్న మౌతూ అన్నాడు ప్రసాదు. సినిమా టైం దాటిపోయింది. నే తలచిన పని జరగనందుకు కోపంతో పిచ్చిదాన్నయ్యాను.

'మిస్టర్ ప్రసాద్! మీరు నన్ను ఫూల్‌ని చేశారు. నా కళ్ళు తెరిపించారు కూడా...శలవ్!' కోపంగాచూస్తూ పౌరుషంగా మాట్లాడి, నా గదివైపు వేగంగా నడిచాను.

'చినబాబూ! అమ్మాయిగారి మనసు నొప్పించావు' సరళంగా ప్రసాదును మందలిస్తూ ఉన్న సీతమ్మ స్వరం వినిపించింది నాకు.

అంతే! రెండు రోజులు నేను ప్రసాదుతో మాట్లాడలేదు. అతను కనుపించినప్పుడల్లా ముఖం త్రిప్పేసుకొనేదాన్ని. అలా చేయడానికి ఎంతగానో నటించవలసి వచ్చేది. అయినా మొండికెత్తాను.

ప్రసాదు ఎంతగానో బతిమిలాడాడు. నేనుమాత్రం నాపట్టు సడలించలేదు. ఒక శుక్రవారం రోజు జరిగిన సంఘటన కళ్ళకు కట్టినట్లు కనుపించసాగింది. తలంటుకొని జుట్టు ఆరబెట్టు కుంటున్నాను సోఫాలో కూర్చుని. అడుగుల సవ్వడి వినిపించి వెనుదిరిగి చూశాను. ప్రసాద్ ఎంతో వినయంగా వచ్చి నాముందు నిలబడ్డాడు. ఆ రోజు కాలేజి శలవు ... కారణం ... ఏదో క్రైస్తవుల పండుగ.

'అమ్మాయిగారూ! మీరు నాతో మాట్లాడడంలేదు. నేనది భరించలేను. నన్ను మన్నించండి'.

నావైపు తదేకంగాచూస్తూ, వినయ విధేయతలు ఉట్టిపడుతూ ఉండగా పై మాటలన్నాడు ప్రసాదు. నేను నా ముఖం ప్రక్కకు త్రిప్పుకొని నా మామూలు మౌనం కొనసాగించాను.

'మీరు మాట్లాడడంలేదు...నా అపరాధాన్ని మన్నించలేరా ?'

'...............'

'దయచేసి మాట్లాడండి... నా నేరానికీనాడు తగిన శిక్ష విధించండి.'

'...............'

'నిజమే...! మీరు నాతో మాట్లాడడానికి అభిమానపడుతున్నారు. నేను అంతటి అదృష్టానికి నోచుకోలేదు. మీరు మాట్లాడని ఈ రెండు రోజులు రెండు యుగాలయ్యాయి నాకు. నేను దురదృష్టవంతుడను.'

దీనంగా చూస్తూ ప్రాధేయపడుతూ, నేను మాట్లాడనందుకు ఎంతగానో బాధ పడసాగాడు ప్రసాదు. అయినా ఏం జరుగుతుందో చూడాలనే ఆదుర్దాతో అలాగే చూపులు తప్పించుకోసాగాను.

'అమ్మాయిగారూ! నిజంగా నేను చేయరాని నేరమే చేశాను. మీరు కోరిన చిన్న విషయాన్ని నెరవేర్చలేకపోయాను. మీకు కోపం తెప్పించాను. దానికి తగిన శిక్ష అనుభవిస్తాను...'

వేగంగా నడుస్తూ వెళ్లిపోసాగాడు ప్రసాదు. ఆ క్షణంలో నా మనసు భయంతో వణికిపోయింది. ప్రసాదు తెగింపు తత్వం గల వ్యక్తి. వెంటనే లేచి అతనిని వెంబడించాను. తన గదిలో ఉన్నట్లు గ్రహించి అటు వెళ్లాను. కాని ఆలస్యం జరిగింది. తలను ఉధృతంగా టేబులుకు వేసి బాదేస్తున్నాడు. చూడలేకపోయాను. నొసలు చిట్లి గాయమై రక్తం కళ్ళ మీదుగా కారి బుగ్గలపై చారలు కట్టింది. ఆ దృశ్యం చూసి కొయ్యబారిపోయాను. వెళ్లి గట్టిగా పట్టుకున్నాను. నా మెదడు పనిచేయడం మానివేసింది. ప్రసాదుపై కోపం మంచులా కరిగిపోయింది. దీనంగా, ప్రేమనిండిన చూపులతో ప్రసాదును చూస్తూ 'నన్ను మన్నించు ప్రసాద్! నా మూర్ఖత్వానికి సిగ్గు పడుతున్నాను.'

'అంత మాటనకండి. అసలు నాదే మూర్ఖత్వం. మీ కోరిక నిరాకరించడం. అటువంటి పొరపాటు యింకెప్పుడూ జరగనివ్వను. మీరు కోరినట్లే సినిమాకు వెడదాం...ఎప్పుడు వెడదామంటారు?'

'ముందు ఆ గాయం మాననివ్వు...ఆ తర్వాత వెడదాం.'

రెండురోజులు గడచిపోయాయి. ఆ రెండు రోజులూ ప్రసాద్ గాయానికి నేనే టిన్‌క్చరు అయోడిన్‌వేసి దూది అతికించాను. అడిగిన వారందరికీ జారిపడినట్లుగా చెప్పుకున్నాడు పాపం! ఒకరోజు ప్రసాదే సినిమా విషయం గుర్తుకు తెచ్చాడు—నే నద్దు చెప్పలేదు. కారులో యిద్దరమూ బయలుదేరాము.

బాక్సు టిక్కట్లు తీసుకు వచ్చేంతవరకు కారులోనే కూర్చున్నాడు ప్రసాదు. ఇద్దరమూ మెట్లెక్కి పై భాగంలో ఉన్న బాక్సుచేరాము. సినిమా ప్రారంభమైంది. ప్రసాదు సినిమా చూడడంలో లీన

# గూడుచేరిన పక్షులు

మయ్యాడు. ఎంతో ఆసక్తితో చూస్తూ ఉన్నాడు. ఇంతకు మించిన అవకాశం తనకు లభించదు. ప్రసాదు ... అవును ... తెల్లని దేహచ్ఛాయ. చురుకైన కళ్ళు, కొసదేరిన ముక్కు, అన్నిటిని మించిన వినయం, అమాయకత్వం...ప్రసాదు అందగాడు. అందరూ అనుకొనే విషయం. చురుకైనవాడు...నలుగురూ ఆమోదించిన సత్యం. చదువులో ఫస్టు ... ఎవ్వరూ కాదనలేని నిజం. ప్రతివారూ అతని స్నేహాన్ని కాంక్షిస్తారు. అతను ఎవరి మనస్సూ నొప్పించడు. ఎవరితోనూ అతి సన్నిహితంగా వుండడు. ఇక కాలేజీలోని అమ్మాయిల సంగతి ... ప్రతి అమ్మాయి ప్రసాదు దృష్టిలో పడడానికి ప్రయత్నిస్తుంది. ఎవ్వరినీ దరికి చేరనివ్వడు. వారి దృష్టిలో ప్రసాద్ గర్విష్టి. తోటి స్నేహితుల దృష్టిలో స్నేహశీలుడు, ఉపకారబుద్ధి గలవాడు, సహృదయుడు. లెక్చరర్ల దృష్టిలో చక్కని విద్యార్థి. పెద్దలయందు గౌరవం, మన్ననగల వ్యక్తి. పై విషయాలు ఆలోచిస్తున్న నేను సినిమా సరీగా చూడకుండా నన్ను నేను మరిచిపోసాగాను. అటువంటి ప్రసాదుకు సన్నిహితురాలనైనందుకు ఎంతగానో గర్వపడ్డాను. అవును అది గర్వకారణమే! అందుకే సహపాఠినులు నన్ను చూసి అసూయపడతారు. నేను నిజంగా అదృష్టవంతురాలను. ప్రసాద్ ప్రక్కగా కూర్చున్న నా మనసు చలించసాగింది. ఏవేవో కోరికలు నన్ను కలచివేయసాగాయి. ఆవేశం పొంగి పొరలసాగింది. అనుకోకుండా నా చేతిని ప్రసాదు చేతితోకలిపి మృదువుగా నొక్కాను. అంతే... నా శరీరంలో విద్యుత్తు ప్రవహించసాగింది. ఆ హాయిని ఎంతోకాలం అనుభవించలేకపోయాను. తదేకంగా సినిమా చూస్తున్న ప్రసాదు ఒకటిరెండు నిముషాలు ఈ విషయాన్ని గ్రహించలేదు. ఆతర్వాత అకస్మాత్తుగా తనచేతిని నా చేతినుండి మెల్లిగా విడతీసి నా ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూశాడు. ఆ కళ్లల్లోని ఆకర్షణ, ఆ అందమైన ముఖవర్చస్సు నన్ను లొంగతీశాయి. ఆవేశంతో అనాలోచితంగా అతనిపై వాలిపోయాను. ఆ క్షణంలో నాకు కలిగిన ఆ అనుభూతి. అబ్బ...! తలుచుకుంటే యిప్పటికీ శరీరం ఆనందంతో గగుర్పొడుస్తూ ఉంది. కాని ఆ అనుభూతి కొన్ని క్షణాలు మాత్రమే కలిగింది. తనపై వాలిన నన్ను గాబరా పడుతూ సరీగా కూర్చోబెట్టాడు ప్రసాదు. అతని స్పర్శలో సర్వం మరిచిపోయాను నేను. ఆలోచనలతో, ఆ మధురానుభూతులతో అలసిపోయిన నేను కళ్ళు మూసుకొని సీటులో వెనుకకు వ్రాలాను.

'అమ్మాయిగారూ! ఏం జరిగింది? మీ పరిస్థితి నాకు భయం కలిగిస్తూ ఉంది. ఇంటికి వెడదామంటారా?' నన్ను అటుయిటు కదిలిస్తూ ఆందోళనపడుతూ అన్నాడు ప్రసాదు! అబ్బ...! అతని స్పర్శ మత్తులో నింపింది నన్ను. నేరే యింకేమీ ఆలోచించకుండా గాఢంగా ప్రసాదును కౌగలించుకున్నాను. అనుకోని ఈ సంఘటనకు తత్తరపడ్డాడు ప్రసాదు. మృదువుగా నన్ను కౌగిలినుండి విడతీశాడు. అంతలో లైట్లు వెలిగాయి. ఇద్దరం తెరవైపు చూశాము 'విశ్రాంతి' అనే అక్షరాలు కనుపించాయి. సిగ్గుతో వంచిన తల ఎత్తలేకపోయాను నేను. అలా నిశ్శబ్దంగా గడిచిపోయింది. సినిమా మళ్లీ ఎప్పుడు ప్రారంభమైందో...పూర్తయింది. లైట్లు వెలిగాయి. ఆలోచనలతో సతమతమౌతున్న నేను అసలు సినిమా చూడనేలేదు. ప్రసాదు ముఖం చూశాను. తెల్లబోయింది, మనసులో ఏదో బాధపడుతున్న వాడిలా కనుపించాడు. నేను ఆవేశంలో త్వరపడ్డాను. సహజమే...అతని ఆకర్షణ అటువంటిది... నా నిగ్రహశక్తిని మించిన ఆకర్షణ.

పై సంఘటన గుర్తుకువచ్చి ప్రసాదు వియోగబాధ యినుమడించింది. ఇంటర్వెల్ కావడంతో సోడా, కాఫీ, అమ్మేవాళ్ళ గోల ఎక్కువైంది. ఇక భరించలేక పోయాను. స్నేహితులతోచెప్పి యింటికి వచ్చేశాను. భోజనంచేసి నిద్రకుపక్రమించాను. ఆలోచనలవల్ల చాలా సేపటివరకు నిద్రరాలేదు. ఎప్పుడో చాలా రాత్రి గడిచిన తర్వాత నిద్ర పట్టింది.

* *

'రేఖా...!'

'..........................!'

'ఓసేవ్! తెల్లవారి చాలా సేపైందే...!

ంటున్న కలలకు స్వస్తి చెబుతావా?'

'ఊఁ...ఎవరు?'

'నేను వాణిని'

మత్తు వదిలి పూర్తిగా తెలివివచ్చింది.

'హాఁ ... వాణి...నువ్వా? అదేమిటే నన్నలా వింతగా చూస్తున్నా వెందుకు?'

'హమ్మయ్య! ఇప్పటికి వచ్చావు తల్లీ ఈలోకంలో! స రే గా ని ... యిప్పుడు టైమెంతయిందో చూడు' తన చేతిని ముందుకుచాపుతూ అడిగింది వాణి.

టైముచూసి ఆశ్చర్యపోయాను ఎనిమిది దాటింది...ఈమధ్య రాత్రిళ్ళు నిద్రపట్టక లేవడం ఆలస్యమౌతూ ఉంది. కళ్ళు మండుతూ ఉన్నాయి.

'నీవొచ్చి ఎంతసేపయిందే వాణీ...?'

'అరగంట దాటింది.'

'మరి...! రాగానే ఎందుకు లేపలేదు నన్ను?'

'నీవు కంటున్నకలలు చెదరగొట్టడం అంత మంచిదికాదని...!'

'అలాగవుతే యిప్పుడెందుకు లేపావ్?'

'కల పూర్తికావచ్చిందని తెలిసి.'

'నీకెలా తెలిసిందే!'

'పలవరింతలవల్ల!'

'నేను పలవరించానటే! అంతా ఉత్తదే! అన్నీ అబద్ధాలు.'

'అవునండమ్మాయిగారూ! మీరు పలవరించడం, నిద్రలోనే సంతోషంతో పొంగిపోతూ ఉండడం నాకళ్ళారా చూశాను.' కాఫీ కప్పులు టేబులుపై ఉంచుతూ పేస్టు బ్రష్ తీసుకురావడానికి వెళ్ళింది సీతమ్మ. సిగ్గుతో కుంచించుకు పోయాను నేను.

సీతమ్మ పేస్టు బ్రష్ తీసుకురాగానే 'వాణీ...! వన్ మినిట్' అని వాష్ బేసిన్ వైపు నడిచాను. ఆ తర్వాత యిద్దరమూ కాఫీ ముగించాము.

'ప్రొద్దుటే యిలా ఊడి పడ్డావ్? విశేషాలేమిటే!'

'అవును...! పానకంలో పుడకలా నేరాకపోతే నీకలలు నీవూ పన్నెండు గంటల దాకా హాయిగా గడిపేదానవో ఏమో?'

'అబ్బ! ఇక చాలించవే నీ ఎగతాళి...'

'సరే! నీ ఒ క ర్తి ద గ్గ రే యింత సెప్పైతే నాకిక పొద్దు చాలినట్లే! గండి పేటకు పిక్నిక్ ప్రోగ్రాం వేశాం, ఎల్లుండి ఉదయం బయలుదేరడం, సాయంత్రం అక్కడినుండి వచ్చేయడం. అక్కడ పగలంతా హాయిగా గడపడం...వస్తాను మరి! ఎల్లుండి ఉదయం ఏడయ్యేసరికి ప్రయాణానికి సిద్ధంగా ఉండాలి.'

పై మాటలని తలపోస్తున్న వాణిని బలవంతంగా మంచంపై నా ప్రక్కన కూలేసాను.

నవగ్గాలూ - గుణాలూ :

# జాజికాయ

గరమసాలా దినుసులలో యిదొకటి. చాలా ఔషధాలలో దీనిని ఉపయోగిస్తుంటారు.

జాజికాయ వేడిచేసి ఆర్పుతుంది. పైత్యం, వాతం, కఫం, చర్ది, గ్రహణి, జ్వరాతిసారం, అరుచి, శూల, ప్రమేహం, క్రిమిరోగం, నోటిదుర్గంధం, కోటిపూత, ఉబ్బు, కామెర్లు, పాండువు, జలోదరం, అగ్నిమాంద్యం, జలుబు, పార్శ్వవాతం గల వారికిది ఎంతోమేలుచేస్తుంది.

మిక్కిలి వీర్యవృద్ధి గావిస్తుంది. రతి సౌఖ్యాన్ని యిస్తుంది. పురుషాంగం క్షీణించి దుర్బలమైనట్లయితే దానిని శక్తివంతం చేస్తుంది. గుండెకు, రొమ్ముకు, లివర్‌కు సత్తువనిస్తుంది. వాతతత్వం గలవారికి ధాతు పుష్ట్యధికం చేస్తుంది.

రుద్రవాతం రాతగిన తత్వం గలవారికి మాత్రం యిది యివ్వకూడదు.

తలనొప్పి ఉన్నట్లయితే నీళ్ళలో జాజికాయ గంధం తీసి నుదుటిపై పట్టు వెయ్యండి. తగ్గుతుంది. చెవి వెనుక లేచెడు వాపు బిళ్ళల పైన, గడవబిళ్ళలపైన దీని గంధాన్ని పూసినట్లయితే అవి తగ్గుతాయి.

పచ్చిజాజికాయల రసాన్ని పరిశుభ్రమైన నీళ్ళలో కలిపి కళ్ళలో వేసినట్లయిన నేత్ర రోగాలు తగ్గుతాయి.

జాజికాయ, సర్పాచెట్టుకాయ నూరి ఆ ముద్ద పెడితే పుప్పిపంటినొప్పి తగ్గుతుంది.

జాజికాయను నేతిలో దోరగా వేయించి కొద్దిగా నల్లమందువేసి, మెత్తగా నూరి, చిన్నచిన్న మాత్రలు చేసి తగు మోతాదులో యిస్తే, గ్రహణి, రక్తగ్రహణి తగ్గుతాయి.

జాజికాయ ఉష్ణతత్వం గల శరీరులకు తలనొప్పి కలుగజేస్తుంది. మరీ మితిమీరి తింటే మత్తు, మగత, కునికిపాట్లు, ఆఖరికి ప్రాణ నష్టం కూడా వాటిల్లవచ్చు. దీనిని లోపలికి యిచ్చేటప్పుడు శరీరతత్వం, దేహదార్ఢ్యం మొదలగునవి గమనించి ఎంతో జాగ్రత్తగా తగు మోతాదులో యివ్వాలి.

చూర్ణపు మోతాదు వయస్సునిబట్టి 3 మొదలు 20 గోధుమ గింజల ఎత్తువరకూ యివ్వవచ్చు.

సరిగ్గా నిద్రపట్టని వారికి జాజికాయ కషాయాన్ని రెండు తులముల ఎత్తుయిస్తే నిద్ర పడుతుంది.

దీనియొక్క దుర్గుణాలకు విరుగుళ్ళు:— 1. ధనియాలు లేక కొత్తిమిరి (తలనొప్పివస్తే), 2. తేనె (ఊపిరితిత్తులలో నొప్పివస్తే), 3. గులాబిపువ్వు, 4. సముద్రపునురుగు.

## జాపత్రికము

గరమసాలా దినుసులలో యిదొకటి. చాలా ఔషధాలలో దీనిని కూడా ఉపయోగిస్తూ ఉంటారు.

దీని చూర్ణం లేక కషాయం వేడిచేసి ఆర్పుతుంది. త్రిదోషాల్ని హరిస్తుంది. ద్వంద్వ రోగాలు, మలమూత్రబద్ధం, శూల, విషూచి, ఎక్కిళ్ళు, అతిసారం, పైత్యపుమంటలు, శ్వాసకాసలు, దురదలు వీనిని హరిస్తుంది. బలాన్ని యిస్తుంది. కడుపులోని వాతాన్ని వెడలగొడుతుంది. పొట్టను శుభ్రపరుస్తుంది. 'బుతు రక్తాన్ని జారీ చేయిస్తుంది. బాలింతలకు చను పాలును ఎక్కువపడేటట్లు చేస్తుంది. శీఘ్ర ప్రసవం గావిస్తుంది. చమట నధికం చేస్తుంది. శరీరంలో ఉండే అన్ని అవయవాలకు సత్తువ నిస్తుంది. నోటివెంట అధికంగా నీరూరడం కడుతుంది. గుండె, లివర్, పొట్ట, ప్రేవులు వీనిలో పుట్టే నొప్పుల్ని హరిస్తుంది. కడుపులోను, పొత్తికడుపులోను ఆయే పుళ్ళను మాన్పుతుంది. ఉబ్బురోగాన్ని పోగొడుతుంది. మూత్రపుసంచిలోని రాళ్ళను తీసివేస్తుంది.

నత్తి ఉన్నదా?..., ఉన్నట్లయితే దీనిని ఎల్లప్పుడూ నోటిలో ఉంచుకోండి. నత్తి తగ్గుతుంది.

చూర్ణపుమోతాదు పూటకు 2 మొదలు 5 చిన్నముల ఎత్తు వరకు. కషాయపు మోతాదు అర ఔన్సు మొదలు 1 ఔన్సు వరకు.

దీనిని అధికంగా పుచ్చుకుంటే ప్లీహకు హాని చేస్తుంది. ఇందుకు విరుగుడు రుమీమస్తకి. మూత్రపు సంచికి నష్టం కలుగజేస్తుంది. ఇందుకు విరుగుడు: వేధానాగింజల పానకం.

సేకరణ: ఆకుండి నారాయణమూర్తి

# గూడుచేరిన పక్షులు

'మరీ అంత తొందరైతే ఎలాగే! నీవు కనుపించి ఎన్ని రోజులైంది?'

'కనుపించి చాలా రోజులే అయిందనుకో! ఇప్పటికే ఆలస్యమైంది రేఖా! ఈ విషయం మనవాళ్ళందరికీ చెప్పాలిగా! మరి నే వస్తా! ఈసారికి సన్నోదులు ఎలాగూ పిక్నిక్‌లో బోలెడు విషయాలు మాట్లాడుకోవచ్చు. ఏమంటావ్? పిక్నిక్‌కు మాత్రం రెడీగాఉండు...'

'ఇంతకీ యిప్పుడు మాత్రం ఉండనంటావ్?' బుంగమూతి పెట్టాను.

'నువ్వు నీ బుంగమూతి బాగానే ఉంది కాని నన్ను వెళ్ళనివ్వు మళ్ళీ కలుస్తాగా...! ప్రామిస్!'

'సరే! నీవంతగా వెళ్ళతలచుకుంటే కాదనేదేముంది? వెళ్ళిరా!'

'గుడ్‌బై...!'

'టాటా..!'

వాణి వెళ్ళిపోగానే బద్దకంగా ఒళ్ళు విరుచుకున్నాను. ఆవలింతలు విపరీతంగా వస్తూఉన్నాయి. కళ్ళు మండుతున్నాయి. నిద్ర ముంచుకువస్తూ ఉంది.

'సీతమ్మా...! నాకు నిద్ర చాలలేదు. ఆవలింతలు బాగా వస్తూఉన్నాయి. నిద్రపోతాను. లేపకేం...!'

'స్నానం చేసి, నాన్నగారితో భోజనం చేసి పడుకోండమ్మాయిగారూ! హాయిగా నిద్రపడుతుంది.'

'లేదు సీతమ్మా...యిప్పుడు లేచే వోపిక లేదు.'

'సరే! మీ యిష్టం!'

సీతమ్మ వెళ్ళిపోగానే నిద్ర కుపక్రమించాను. ఎంతసేపు నిద్రపోయానో ఏమో? ఉలికి పడి లేచాను. పిల్లి స్టూలుపై ఉన్న కప్పు సాసరును క్రిందపడవేసి పారిపోయింది. అవి పగిలిపోయాయి. చప్పుడు వినపడి విషయం తెలుసుకుందామని కాఫీలు సీతమ్మ పైకి వచ్చింది ఆత్రుతతో—

'అయ్యో! ఎంత మందమతిని...కప్పులు, సాసర్లు తీసివేయడం మరిచే పోయాను. బంగారంలాంటి జత పగిలిపోయింది.'

'పోనీలే సీతమ్మా! పగిలిన ముక్కలు జాగ్రత్తగా తీసిపారవేయి. కాళ్ళకు గుచ్చుకుంటాయి.'

సీతమ్మ పగిలిన ముక్కలను ఒక దస్ట్‌రకు తీయసాగింది. చెదిరిన భావాలను నేను కూడ తీయసాగాను. మగత నిద్ర...అర్థం పర్థం లేని పిచ్చి కలలు. బాగా అలసట... యిప్పుడే కలలో ప్రసాదు కనిపించాడు. ఆత్రుతగా ఏదో మాట్లాడాలనుకుంది. సిగ్గు తెరలవల్ల మాట పెగిలిరాలేదు. ఆప్యాయంగా పిలిచాడు. ఇంతలో తెలివి వచ్చింది. ఎప్పుడొస్తాడో...? వెళ్ళి కొద్ది కాలమే అయినా, నాకు మాత్రం ఎంతో కాలం గడిచినట్లుగా ఉంది. ఈ రోజు వాణి వచ్చింది. మనసుకు కొంత హాయి. వాణి నా ప్రాణ స్నేహితురాలు. తెగువ—చురుకుతనం దాని సొత్తు. పాపం...! ప్రసాదును తన వాడిగా చేసుకోవాలని ఎంత ప్రయత్నం చేసిందో! దాని ప్రయత్నాలు విఫలమయ్యాయి. [illegible] మయ్యాకే యిద్దరమూ బాగా సన్నిహితులమయ్యాము. అప్పుడు జరిగిన ఆ సంఘటనలు గుర్తుకు వచ్చాయి. కాలేజీలో వార్షికోత్సవాలు జరుగుతున్న రోజులవి. వక్తృత్వ పోటీలో గెలుపు ప్రసాదుది. వ్యాసరచన ... గెలుపు ప్రసాదుది. గేయ రచన ప్రసాదుదే గెలుపు—ఆటల పోటీలు... రెండు వంతులు ప్రసాదుకు బహుమతులు. నాటిక ప్రదర్శన ... ఉత్తమ నటుడుగా ప్రసాదుకు బహుమతి. నా ప్రక్కనే కూర్చొని వాణి ప్రసాదును నమిలి మింగేలా చూడసాగింది.

'అబ్బ! ప్రసాదు ఎంత చురుకైనవాడే రేఖా...? చదువులో, సాహిత్యంలో ఆటలలో అన్నింటా ఉన్నానంటాడు.'

నేను మాట్లాడలేదు. దాని చూపులకే ఈర్ష్యపడుతూన్న నాకు దాని మాటలు గాయం పై కారం చల్లినట్లుగా ఉన్నాయి. అదేమిటో? ప్రసాదును నా స్నేహితురాళ్ళు ఎవరైనా అతిగా పొగిడినా, కన్నార్పకుండా చూసినా, ఈర్ష్య నన్ను నిలువునా దహించేసేది. యిప్పుడు కూడా అదే జరిగింది.

'అతని జోక్యం నీకెందుకే? మహా గర్విష్టి' ఎలాగైనా దాని మనసులో నుండి ప్రసాదు గురించిన ఆలోచనలు తప్పించాలని అన్నాను. కాని ఫలితం శూన్యం. వాణి తన ధోరణి మానలేదు. దాని వాగుడుకు అంతులేదు. కోపంతో కళ్ళెర్రజేసాను. కాని అది నావైపు చూడందే! ఉత్సాహంతో తన ధోరణి సాగిస్తూనే ఉంది. వాణి ధోరణి చూసిన నాకు ప్రసాదును పెద్దలు పొగిడిన పొగడ్తలు, అతను సంపాదించిన బహుమతులు, కార్యకర్తలు అతనిని అభినందిస్తూ మాట్లాడిన మాటలు, మిత్రులంతా సంతోషంతో ప్రసాదుని తదేకంగా పొగుడుతూ మాట్లాడుతూన్న మాటలవల్ల కలిగిన సంతోషం, పులకింత మాయమయ్యాయి. మనస్సంతా కోపంతో నిండిపోయింది. ఆవేశంతో ఒణికిపోయాను. కారణం ... ప్రసాదు నావాడనే దృఢవిశ్వాసం. వార్షికోత్సవాలు బహుమతి ప్రదానంతో ముగిశాయి. అంతా బయలుదేరి వెళ్ళిపోతున్నారు. ఆ హడావుడిలో ప్రసాదు నా వైపు రావడం ... అతనినే గమనిస్తూన్న అందరికళ్ళూ మాయిద్దరిపై పడడం గమనించి గర్వించాను. ఇంతలో వాణి మా యిద్దరిమధ్య అడ్డుపడి 'హల్లో ప్రసాద్...! కంగ్రాచ్యులేషన్స్ మీ విజయాలకు నా హృదయపూర్వక అభినందనలు.' వాణి మాటాడిన మాటలతీరు, ఆ చూపులు, హావభావాలు భరించలేక పోయాను. ప్రసాదు నలుగురికి థ్యాంక్సు చెప్పిన విధంగానే వాణితో 'థ్యాంక్యూ' అని నాతో మెల్లిగా 'అమ్మాయిగారూ! ఇక వెడదామా?' అన్నాడు. 'అలాగే...!' నని యిద్దరమూ కారువైపు నడక సాగించాము. ఎందుకో వెనుతిరిగి వాణిని చూడాలనిపించి చూశాను. దాని ముఖం జేవురించి ఎర్రగా కనుపించింది. ప్రసాదు మామూలుగా బస్సులోనే కాలేజీకి—కాలేజీనుండి యింటికి వస్తాడు. ఇటువంటి ప్రత్యేక సమయాలలో బస్సులు దొరకనటువంటి ప్రత్యేక సమయాలలో నా కారులో రాక తప్పదు. అటువంటి అవకాశం నాకు ఎప్పుడు లభిస్తుందా...అని ఎదురుచూస్తూ ఉంటాను.

'వాణి కూడా ప్రసాదును ప్రేమిస్తున్నదా...?' అనే సందేహంతో మనసులో ఈర్ష్యపడుతూ, ప్రసాదు సాన్నిధ్యంలో అనుభవించవలసిన ఆనందాన్ని అనుభవించలేకపోయాను.

(ఇంకా ఉంది)




ఈ రోజు నుండి మన చింతపండు పేరు ఇన్‌స్టామ్. చింతపండు
తన హోదా పెంచుకొంది. ఇది ఆధునిక శాస్త్ర పరిశోధన వల్ల సాధ్యపడింది.
ఇన్‌స్టామ్ రూపంలో చింతపండు, చాలా చిక్కని గుజ్జుగా, తక్షణతయారీ చింత పండుగా అవుతుంది.
ఇన్‌స్టామ్‌లో రసాయనములు గానీ, రంగులుగానీ చేర్చబడ లేదు. పరిశుభ్రముగా శుద్ధి నొంది, అందమైన
గాజు జాడీ లో మీ చేతికి వస్తుంది! బజారులో, అంగడిలో, మట్టి పేరుకొన్న బుట్టలతోను, క్రిమి
కీటకాలతోనూ ఉన్న చింతపండుకి యిక పనిలేదు. ఇన్‌స్టామ్‌తో వంట ఎంతో రుచి— చిన్న చెంచాడు
ఇన్‌స్టామ్‌తో ఎనిమిది మందికి సరిపడే వంట చేసుకోవచ్చు. ఇప్పుడు ఇన్‌స్టామ్‌కి మీ ఆధునిక గృహంలో
చక్కని చోటు దొరికింది. సెన్‌ట్రల్ ఫుడ్ టెక్నొలాజికల్ రీసర్చ్ ఇన్‌స్టిట్యూట్ వారి
పరిశోధనా ఫలితం ననుసరించి అతి పరిశుభ్రముగా ఉత్పత్తి చేయబడింది.

శ్రీ వెంకటేశ్వర ఫుడ్ ప్రాసెసింగ్ (ప్రై) లిమిటెడ్, ఎన్. పి. రోడ్, నిడదవోలు— ప. గోదావరి జిల్లా. ఆం. ప్ర.

ఆంధ్రప్రదేశ్ అన్ని చోట్ల లభించును.

దక్షిణ ఇండియాలో ప్రాతినిధ్యము లేని పట్టణాలకు డిస్ట్రిబ్యూటర్లు కావలెను.




నిన్నగాక మొన్న—

చిన్ననాడు చదువుకున్న వూరుగదా, ఒకపూట వుండి బాల్యమిత్రులతో సరదాగా గడుపుదామని నేనావూళ్ళో బసచేయక పోయినా,—

మనసు అట్టడుగు పొరల్లో; జ్ఞాపకాల ధూపంలో నిక్షిప్తమైన చలపతి హఠాత్తుగా నా కళ్లెదుట సాక్షాత్కరించక పోయినా,—

అతను 'డా. చలపతి, హోమోపాత్, రిట్రీవ్స్ స్పెషలిస్టు'గా ఆ వూళ్లో పేరు ప్రఖ్యాతుల్ని ఆర్జించాడని నేను వినక పోయినా,—

నేనీ కథ వ్రాసి వుండేవాడ్ని కాదు.

పది పన్నెండు కాలెండర్లు మారక పూర్వం—

జిల్లాకు ఒకటి రెండు కంటే ఎక్కువ లేని కాలేజీలలో విద్యాభ్యాసానికై, ఉన్న వూరు విడిచి పట్టణాలకు తరలి వచ్చిన అనేక మంది విద్యార్థుల్లో నేనొకడ్ని. ఊరికి దూరంగా వున్న కాలేజీ కావడాన్నేమో, కాలేజీలో సీటుకంటే, హాస్టల్లో సీటు దొరకడం చాలా కష్టంగా వుండేది ఆ వూళ్లో.

కాలేజీకి, హాస్టలుకు సంబంధించిన పాత జ్ఞాపకాలెన్నో వున్నా, 'ఏఁవండీ'తో ప్రారంభమై 'ఏరా' వరకూ వచ్చే స్నేహితులెంతో మంది వున్నా, చలపతి మాత్రం నా మనసులో శాశ్వతంగా విశిష్టమైన స్థానాన్ని ఏర్పరచుకున్నాడు.

ఆరోజు రాత్రి...

అప్పటికి హాస్టల్లో చేరి వారం రోజులైందేమో. నా రూమ్మేటు హరి మినహాయించి మరెవరూ నాకు పరిచయం కాలేదప్పటికి. రాత్రి తొమ్మిదిగంటల సమయంలో ప్రక్క గదిలో నుంచి పెద్దగా మాటలు విన్పించాయి.

'ఏమైనాసరే, నువ్వీగదిలో వుండటానికి వీల్లేదు. నాతో సమానంగా చదువుతున్నంత మాత్రాన నా గదిలో వుండే అర్హత నీకు లేదు. నేనిప్పుడే వెళ్లి వార్డన్‌కు అన్ని విషయాలూ చెప్పేస్తాను.'

'బాబుగారూ! ఆ పని మాత్రం చేయకండి. ఇప్పటికే నలుగురిలో తలెత్తుక తిరుగలేకుండా వున్నాను. ఆ విషయాలన్నీ మీరు బయటపెట్టొద్దు. మీకు పుణ్యముంటుంది.'

'నీకు నామర్దా ఏమిట్రా వెధవా ఒకవూరివాళ్లమనే మిషతో ఒకేరూంలో నాతో సమానంగా వుందామని ఎత్తువేస్తావా ?'

'నేను కావాలని కోరలేదు బాబుగారూ నామాట నమ్మండి.'

'అయితే వెళ్ళు వార్డెన్‌గారికి చెప్పి మరో గదిలో వుండు, పో.'

పాదాలు కనిపించనంత క్రిందికిపైజామా, మోకాళ్లదాకా షర్టు; అవమానంతో కందిన మొహాన్ని కర్చీఫుతో తుడుచుకుంటూ, అతను వార్డెన్ రూంవైపు నడవడం చూశాను, అప్పటికే వరండాలోకొచ్చి

నిల్చున్న నేను:

అతనే చలపతి.

ఆ సమయంలో హరి రూంలో లేడు. కొంత సేపటికి వచ్చాడు. ప్రక్కగదిలో మిత్రుల తగాదా విషయం నేనతనికి చెప్పక ముందే హరి అన్నాడు: మన ప్రక్క రూంలో చలపతి లేడూ, ఇవాళ వేడి వేడి పకోడీలు తిన్నాడు వార్డెన్ దగ్గర.'

పకోడీలంటే చీవాట్లు, చేగోడీలంటే తన్నులూ మా పరిభాషలో.

'ఎందుకూ?' కుతూహలంగా అడిగాను.

'తనకా రూం వద్దుట, మరోచోటి కావాలిట.'

'కారణం?'

'ఏమోమరి సరిగా చెప్పలేదు. వార్డెన్‌కు బలేకోపం వచ్చింది...'

ఇంతలో వరండాలో ఎవరో నడుస్తున్న అలికిడి విన్పించింది.

'వెంకుబాబూ!'

'సార్'

'చలపతిది మీవూరే కదూ?'

'అవునండీ.'

'మీ యిద్దరికీ విరోధమేమైనా వుందా?'

'విరోధమూలేదు, అలాగాని స్నేహమూ లేదండి.'

'ఆన్సర్ టుదిపాయింట్. దట్సాల్ రైట్...చలపతీ పిచ్చివేషాలు వేయకు. ఇష్టమొచ్చిన రూం కావాలనేందుకు ఇది హోటలుకాదు. డిసిప్లిన్డ్‌గా ఉండాల్సిన హాస్టలు. ఎల్లాట్‌చేసిన రూంలో అడ్జెస్టు కావలశిందే. తెలిసిందా?'

వార్డెన్ వెళ్లిపోయాడు. చుట్టుప్రక్కల గదుల్లోనుంచి వరండాలోకొచ్చి, గదిలోవున్న చలపతివైపు, వెంకుబాబు వైపు వింతగా చూడటం మొదలెట్టారు విద్యార్థులు. అందరిసంగతి ఏమోకాని, నాకుమాత్రం వెంకుబాబు కళ్లల్లో కోపమూ, అధికారమూ, తల వంచుకుని నిల్చున్న చలపతిలో నిస్సహాయతా కన్పించాయి. పరిసరాల్ని గమనించిన వెంకుబాబు చివాలున వచ్చి గది తలుపులు మూయడంతో విద్యార్థులు ఎవరి గదుల్లోకి వాళ్లు వెళ్లిపోయారు.

పాఠాలింకా మొదలెట్టకపోవడంమూలాన చదవవలసింది ఏమీ లేక పడుకున్నాను. కాని నిద్రపట్టలేదు. ప్రక్క గదిలో వెంకుబాబు కంఠం విన్పించింది.

'గెల్చాననుకుంటున్నావేమో, నీ జుట్టు నా చేతిలో వుంది. నేను చెప్పినట్లు వినక పోయావో నీ పని పట్టా.'

'మీరు చెప్పినట్లే వింటాము. నన్నల్లరి పెట్టొద్దు బాబుగారూ?' చలపతి నమ్రతగా పలుకుతున్నాడు...

తెల్లవారి, మొహం కడుక్కోటానికి పంపు వేపు వెళ్తూ, కిటికీలోనుంచి ప్రక్క గదిలోకి చూశాను. ప్రతి గదిలోను రెండు కుర్చీలు, రెండు టేబుళ్లూ ఉంటాయి, గదిలో వుండే ఇద్దరూ కూర్చుని చదువు కోడానికి వీలుగా. ఆ గదిలోని రెండు టేబుళ్లూ నిలువుగా ఒకదానికి దగ్గఱగా మరొకటి జరుపబడి వున్నాయి. వాటిమీద పరుపు వేసుకుని పడుకున్నాడు వెంకు బాబు. వో మూల, చాప మీద చలపతి పడుకున్నాడు.

తన ఆధిక్యతను (?) ఆ విధంగా నిలుపుకున్నాడు వెంకుబాబు. నాకు ఒకటి మాత్రం అర్థంమైంది, వెంకుబాబు చలపతిని ఏదో తక్కువ దృష్టితో చూస్తున్నాడని. కారణం? వెంకుబాబు అగ్రజాతి వాడా? కాదే. ఇద్దరూ మాంసాహారులే. మరి?

మొహాలు కడుక్కున్నవాళ్లలో కొందరు తిరిగి హాస్టలు వేపు వెళ్తున్నారు. మరి కొందరు స్నానాల గదులవైపు నడుస్తున్నారు. అప్పటికి వెంకుబాబు రావడం, మొహం కడుక్కోడం అయిపోయింది. చలపతి చేతిలో పళ్లపొడితో పంపుల దగ్గఱ ఖాళీకోసం చూస్తున్నాడు.

'ఒరేయ్ చలపతీ! రూం కెళ్లి, టవలూ, సోప్‌బాక్స్ తెచ్చిపెట్టు. స్నానం చేయాలి.'

వెంకుబాబు హుకుం జారీ చెయ్యడం, చలపతి బుద్ధిమంతుడైన నౌకరులాగా శిరసావహించడం నేను, హరి—అందరం గమనించాం.

అప్పట్నుంచీ చలపతి అంటే ఒక విధమైన జాలి ఏర్పడింది నాలో. వెంకుబాబు తన కవసరమైన ప్రతి పనికీ చలపతిని నౌకరుగా వాడుకోవడం, అది చూసిన మిత్రులు కొందరు వాళ్లిద్దర్నీ ఆటలు పట్టించడం పరిపాటైపోయింది.

'ఏమండోయ్ వెంకుబాబు గారూ! కుర్రాడ్ని బాగా వాడేసుకుంటున్నారే.'

'వెంకుబాబుగారూ! నిద్రమత్తుగా వుంది. మీ ఫ్లాస్కునుంచి కొంచెం కాఫీ తెప్పిద్దురూ.'

'అంతేనా, ఇంకేమైనా కావాలా? చెప్పండి బాబూ, మొహమాట పడకండి. తెచ్చేది మనవాడే.'

విద్యార్థి జీవితంలో ఒకర్నొకరు ఆటలు పట్టించుకోడం, ఏడ్పించడం, తద్వారా వినోదించడం — మామూలే. అయితే ఆ ఆటలకు వినోదాలకు గురిచేయబడిన విద్యార్థి కూడా ఇతరులను ఆటలు పట్టించడంలో సమవుజ్జీ అయినప్పుడూ, తనను ఆటలు పట్టిస్తున్నందుకు అతను బాధ పడనంతవరకూ ఆ గేమ్ బాగా నే వుంటుంది. కాని చలపతిలాంటి వినమ్ర జీవి, ఎన్నడూ ఎవరికీ ఎదురు పలుకని సాధువు, వెంకుబాబు మాటలకు, అతని ద్వారా ఇతర మిత్రుల మాటలకు లోలోన ఎంత కృంగిపోతున్నాడో ననిపించేది నాకు.

స్నేహితుడిగా చలపతికి చేరువౌదామన్నీ, తద్వారా అతనికి కొంత సాంత్వన లభిస్తుందని అనుకుని అందుకు ప్రయత్నించాను. కాని అతనికి చేరువకాలేకపోయాను. కావడానికి అతను అవకాశం ఇవ్వలేదు. తను దాచుకున్న రహస్యాలు నాకు తెలుస్తాయనే భయం అందుక్కారణమేమో!...

ఒకే రూంలో వుంటున్న వెంకుబాబు, చలపతి ఇద్దరూ ఒకేసారి కాలేజీకి రావడంగాని, కాలేజీనుండి కలిసి ఇంటికి రావడంగాని ఎవరూ చూసి వుండరు. కాని ఆ విషయాన్ని ఎవరూ పట్టించుకోలేదు. క్లాసులో కూడా వెంకుబాబు ముందు బెంచీపై కూర్చుంటే, చలపతి వెనకాల చివరిబెంచీపై కూర్చునేవాడు. మెస్‌లో ఈమూల వెంకుబాబు కూర్చుని భోంచేస్తే, మరోమూల ఎక్కడో చలపతి తలవంచుక కూర్చుని అన్నం తినేవాడు.

ఒకరోజు రాత్రి పదిగంటల సమయంలో చలపతి మా గదితలుపు కొట్టాడు. నేను వెళ్లి తలుపు తీశాను. 'మీ దగ్గర టార్చి లైటుంటే ఒకసారిస్తారా' అని అడిగేడు. డ్రాయరు సొరుగులోని లైటు తీసియిస్తూ 'ఇప్పుడెందుకు' అని అడిగేను.

'వెంకుబాబుగారికి తలనొప్పిగా వుందిట. టౌనుకెళ్లి ఏవైనా టాబ్లెట్స్ తీసుక వద్దామని' (వెంకుబాబే తెమ్మని వుంటాడు)

చలపతి సమాధానానికి నేను ఆశ్చర్యపో

లేదుగానీ, నేలరోజుల క్రితం చలపతికి 'ఫ్లూ' వస్తే వెంకుబాబు తనకేమీ పట్టనట్లుగా తిరిగాడేరి, అసలు రూంలో చలపతి వున్నాడనే విషయాన్నే విస్మరించినట్లు ప్రవర్తించడం గుర్తుకు వచ్చి బాధ పడ్డాను. అలాంటి వెంకుబాబు కోసం చలపతి ఇంత రాత్రప్పుడు తల నొప్పి మాత్రల కోసం ఒంటరిగా టౌనులోకి వెళ్తున్నాడు మరి!

'అంత దూరం ఒక్కడివీ వెళ్తావా?'

'ఫరవాలేదండే. ఒంటరిగా నడవడం నాకు అలవాటే' అంటూ వెళ్ళి పోయాడు చలపతి.

అతను వెళ్ళిం తర్వాత హరి అన్నాడు: 'మనం చూట్టం లేదుగాని, వెంకుబాబు చలపతి చేతికాళ్ళు పట్టించుకున్నా పట్టించుకోగలడు.'

'దారుణం. చలపతి ఇవన్నీ ఎందుకు సహిస్తున్నాడు? ఇతగాడ్ని ఆ వెంకుబాబేమైనా పెట్టి పోషిస్తున్నాడా, జులుం చెలాయించడానికి?'

'పోషించనవసరం లేదు బ్రదర్! దీసీజు బీజేనెస్. చలపతికి సంబంధించిన ఒక వ్యక్తిగత విషయం వెంకుబాబుకు తెలుసు. ఆ విషయం నలుగురికీ తెలియడం చలపతి కిష్టంలేదు. వెంకుబాబు ఆ విషయాన్ని ఎక్కడ బయటపెడ్తాడోనని భయం చలపతికి. అతనిలోని ఆ బలహీనతను వెంకుబాబు ఉపయోగించుకుంటున్నాడు.'

'ఏమిటో, అంతరహస్యమైన వ్యక్తిగత విషయాలు!'

'చలపతి ఎప్పుడూ పైజామా ఎందుకు వేసుకుంటాడు? అందరిలా సాయంత్రం గేమ్స్ ఆడుకోడానికి రాడేం? వారానికి ఒకటి రెండు సార్లైనా టౌనుకు వెళ్ళి, పొద్దుపోయిందాకా ఏం చేస్తుంటాడు? ఈ ప్రశ్నలకు జవాబుల్లో వుంది ఆ రహస్యం. చలపతికి బోదకాలు వుంది. దాన్ని కప్పి పుచ్చుకోడానికే పాదాల క్రిందకి వేళ్ళాడే పైజామా. ఆ విషయం నలుగురికీ తెలుస్తుందనే అందరితోటీ గేమ్స్ ఆడడు. హోమ్యోపతి మందుల్తో ఆ బోద కాలు నయమౌతుందని ఎవరో చెప్పారుట. అందుకని టౌన్లో ఎవరో హోమ్యో డాక్టరుంటే ఆయన దగ్గరకు మందుకోసం వెళ్ళి వస్తుంటాడు. ఆ డాక్టరు ఇచ్చేది రెండు బిళ్ళలైనా రెండు గంటలు స్టడీ చేస్తాడుట.'

హరి చెప్పిన విషయాలు సబబుగానే వున్నా నాకు నమ్మశక్యంగా తోచలేదు. చలపతికి బోదకాలు వున్నదని అందరికీ కాకపోయినా అతనితో సన్నిహితంగా వుండే చాలా మందికి తెలుసు ... అందుకే పి. డి. (ఫిజికల్ డైరెక్టరు) అతనికి జనరల్ పర్మిషన్ ఇచ్చేశాడు 'ఆడ వీలుగాని గేమ్స్ ఆడనక్కర్లేద'ని మరి చలపతి వెంకుబాబుకు ఎందుకు భయపడుతున్నాడు?

ఒకనాడు తెలుగుక్లాసు జరుగుతుండగా చలపతికోసం ఎవరో వచ్చారని కాలేజీ వెయింటింగ్ రూంలో వున్నారని చెప్పాడు కాలేజీప్యూన్. చలపతివెళ్ళి మరో అరగంటలో తిరిగివచ్చాడు. కాలేజీ వదిలేముందు నాదగ్గరకొచ్చి 'కిటికీలోనుంచి మీ గదిలోకి రెండు మొక్కజొన్న పొత్తులు వేశాను. మీరు హరిగారూ తీసుకోండి. ఈ విషయం మాత్రం వెంకుబాబుగార్కి తెలీనీకండి ప్లీజ్' అన్నాడు. వాళ్ళవూరునుంచి ఎవరో వస్తుంటే వాళ్ళనాన్న పంపేడు మొక్కజొన్న పొత్తులు, చెరకు ముక్కలు. కాని వాటిని తెరగించేది వెంకుబాబేగాని చలపతి కాదని నాకు తెలుసు. చలపతిదగ్గర చిల్లర డబ్బుల్నే లాగే వెంకుబాబు మొక్కజొన్న పొత్తుల్నీ చెఱకు ముక్కల్నీ వదిలిపెడ్తాడా?'

ఇంటర్మీడియెట్ పబ్లిక్ పరీక్షలు మొదలైనై. తెల్లవారితే ఇంగ్లీషు పరీక్ష. నేను వ్రాసుకున్న కొన్ని వ్యాసాలలో తప్పులున్నాయనే అనుమానంతో చలపతి నోట్సుతెచ్చి సరిచూసుకున్నాను. అప్పటికి పదకొండు గంటలయింది. చలపతి నోట్సు తిరిగి ఇచ్చేద్దామని వాళ్ళగది కిటికీ దగ్గరకు వెళ్ళాను. వెంకుబాబు పడుకుని నిద్ర పోతున్నాడు. చలపతి అరఠావు కాగితం మీద సన్నని అక్షరాలతో ఏదో వ్రాస్తున్నాడు. నోట్సు ఇచ్చేస్తూ 'ఏమిటి వ్రాస్తున్నావ్' అని అడిగాను.

'ష్‌ష్ అరవకు వెంకుబాబుగారికి ఎస్సేలు రాలేదుట. పరీక్షలో కాపీచేయడానికి వీలుగా కాగితంమీద వ్రాశివ్వమంటే వ్రాస్తున్నాను. కాపీ చేయువద్దని ఎంతచెప్పినా వినలేదు' అన్నాడు.

'నోట్సు నాదగ్గరే వుందికదా, ఎలా వ్రాస్తున్నావ్? నీకు కంఠతా వచ్చాయా?'

చలపతి నవ్వేడు. నేను మెదలకుండా వచ్చేశాను.

మర్నాడు పరీక్షహాల్లో చలపతి కాళ్ళ దగ్గర పడివున్న కాగితపు వుండను పైకి తీసి దాన్ని విప్పిచూశారు వాచరు విశ్వనాథంగారు. ప్రశ్నాపత్రంలోని రెండు ముఖ్యమైన ప్రశ్నలకు సంబంధించిన వ్యాసాలవి.

'ఎవరిపని చేసింది? విశ్వనాథంగారు చలపతిని గద్దించారు.

'నాకు తెలియదండీ.'

'నీకు తెలీకుండానే నీ కాళ్ల దగ్గఅకు వచ్చిందా?'

'ఎవరో విసిరితే నా కాళ్ల దగ్గఆ పడొచ్చు గదండీ.'

ముందు బెంచీలో కూర్చున్న వెంకుబాబు తీక్షణంగా చూశాడు చలపతి వైపు.

'అలాగా. ఏదీ నీ ఆన్సర్ బుక్ చూడనీ' అంటూ చలపతి ఆన్సర్ బుక్‌లోని వ్యాసాలు, కాగితంలోని వ్యాసాలు పరిశీలించి ఆ రెండూ ఒకటేనని పైగా దస్తూరి కూడా సరిపోయింది కాబట్టి చలపతి కాపీ చేశాడని నిర్ణయించి, ఆ విషయాన్ని చీఫ్‌కు రిపోర్టు చేశారు విశ్వనాథంగారు.

చలపతికి జరిగిన అన్యాయానికి నాకు ఏడుపొచ్చింది. చలపతి పరీక్షలో కాపీ చేయలేదు. అది నిజం. కాపీ చేసింది వెంకుబాబు. అది నాకూ, చలపతికీ తెలుసు. కాని ఆ నిజాన్ని ఎవరు బయటపెట్టాలి?

'చలపతీ! వెంకుబాబుకు సేవలు చేయడం, అతను చెప్పినట్లల్లా నువ్వాడటం బాగా వుందేమో కాని ఇప్పుడు నీవు చేస్తున్నది మాత్రం బాగా లేదు. నీ మీద పడిన ఈ నేరం నీ జీవితానికే దెబ్బ. బాగా ఆలోచించుకో. ఇప్పటికైనా మించిపోలేదు. చీఫ్‌కి కనిపించి జరిగినదంతా చెప్పు. నీలాంటి బ్రిలియంట్ స్టూడెంట్ కాపీ చేస్తాడని ఎవరూ నమ్మరు. చీఫ్ తప్పకుండా వింటాడు' అన్నాను.

'కాని...ఆ కాగితం నా దస్తూరీతో వున్నది. కాపీ చేసేవాడెవడైనా కాపీ మెటీరియల్‌ను స్వయంగా వ్రాసి తెచ్చుకుంటాడు. కాని వెంకుబాబు నాచేత వ్రాయించి తెచ్చు

కున్నాడు. ఈ విషయాన్ని నేను చెప్పినా ఎవరు నమ్ముతారు ?'

అతని నిస్సహాయ పరిస్థితికి నే నేవిధం గానూ సాయపడలేకపోయాను.

ఇంతలో వెంకుబాబు అక్కడికి వచ్చి చలపతితో అన్నాడు. 'ఒరేయ్ చలపతీ ! నీవేం భయపడమాకు. ఆ వెధవగాడి సంగతేదో నేను చూస్తాగా; రిపోర్టిస్తాడూ, రిపోర్టు !' వెంకుబాబు దూకుడుగా వెళ్ళి పోయాడు. నేను, చలపతి హాస్టలుకు నడిచాం.

ఆ రాత్రికి ... కాలేజీనుండి ఇంటికి వెళ్తున్న లెక్చరర్ విశ్వనాథంగారిపై ముసుగువేసి నలుగురు విద్యార్థులు ఆయన్ని కొట్టారని, చలపతి కాపీ చేశాడని రిపోర్టిచ్చినందుకు చలపతే ఆయన్ని కొట్టించినట్లుగా, విశ్వనాథంగారు లిఖిత పూర్వకంగా ప్రిన్సిపాల్‌కు రిపోర్టిచ్చాడని వార్త మోసుకొచ్చాడు హరి.

నాగుండె జల్లుమంది. వెంకుబాబు చేసిన ఈ నేరం కూడా చలపతి మీదనే పడింది. చలపతి ఊబిలో ఇరుక్కున్నాడు. తనను తాను రక్షించుకునే స్థితిలో లేడు చలపతి. అందుకని నిజాన్ని నేనే బయట పెడ్దామని నిర్ణయించుకున్నాను. నేనుగా

# గేమ్

ప్రిన్సిపాల్‌కు వెళ్ళి చెప్పడం కంటే హాస్టల్ వార్డెన్ ద్వారా చెప్పిస్తే బావుం టుందని తోచింది నాకు. వెళ్ళి వార్డెన్‌కు చెప్పాను.

'విశ్వనాథంగార్ని కొట్టింది ఎవరో తెలీదు గాని, కొట్టించింది మాత్రం చలపతి కాదు మేష్టారూ'

'మరి నువ్వా?'

'అదేమిటిసార్ అలా అంటారు?'

'ఇంకెలా అనమంటావ్ బ్రదర్! ఆ కాపీ కాగితంలోని దస్తూరి తనదేనని చల పతే ఒప్పుకున్నాడు. అందులోని వ్యాసాలే ఆనర్స్ బుక్‌లో యధాతథంగా కన్పిస్తు న్నాయి. విశ్వనాథంగారు రిపోర్టిచ్చారు. ఆ తర్వాత ఆయన్ని కొట్టారు. ఈ విష యాల్ని ఆధారంగా ఆలోచిస్తే, తన మీద చెయ్యి చేసుకున్న వాళ్ళకు ప్రోద్బలం చలపతే అని విశ్వనాథంగారు విశ్వశించ డంలో తప్పులేదు, అలా అని ప్రిన్సి పాల్‌కు రిపోర్టివ్వడంలోనూ తప్పులేదు ... అనవసరంగా ఊబిలో దిగకు. వెళ్ళు.'

తమదాకా రానంతవరకూ చాలామంది అసత్యాన్ని, అన్యాయాన్ని చూసి కూడా




చూడనట్లు నటించడమెందుకో వార్డెన్ గారి మాటలవల్ల నా కర్థమైంది. అయి ష్టంగానే రూం కొచ్చాను.

చలపతిని గురించిన ఆలోచనతో రాత్రంతా నిద్రపోలేదు. నిద్రలేచేసరికి కొంచెం ప్రొద్దెక్కింది.

'చలపతి-అంతర్థానమైపోయాట్ట' హరి మాటలకు విస్తుపోయాన్నేను.

ఆ తర్వాత చలపతిని ఐదుసంవత్సరాలు 'డిబార్' చేశారని తెలిసింది.

వేసవి శలవులు అయింతర్వాత కాలేజీలు తెరిచారు. డిగ్రీ క్లాసులో చేరాలని వచ్చిన వాళ్ళలో వెంకుబాబు కూడా కన్పించాడు.

'చలపతి మీ వూళ్ళో వున్నాడా?' అని అడిగేను, వెంకుబాబును.

'మా వూరికి వెళ్ళలేదుట వాడు. ఇప్పు డెక్కడున్నాడోకూడా తెలీదు. పాపం వాళ్ళ నాయన కలరావచ్చి చనిపోయాడు. మావూరు వచ్చివుంటే వాడికి కలరా వచ్చేది' వెకిలిగా నవ్వేడు వెంకుబాబు.

'చాలా దారుణంగా మాట్లాడేస్తున్నారు మీరు' అన్నాను.

'ఈరోజుల్లో ఉన్న యదార్థాన్ని చెప్తే దారుణమనే వాళ్ళని మిమ్మల్నే చూశాను. నే న లా ఎం దు క న్నా నో మీ కేం తెలుసు? వాడికా బో ద కా లు ఎందు కొచ్చిందనుకున్నారు? వాళ్ళ నాన్నమూలాన్నే. వాళ్ళనాన్నకు రెండుకాళ్ళా బోద. వాళ్ళ నాన్న మా వూ ళ్ళో వీధులూడ్చేవాడు మేష్టారూ. అప్పుడప్పుడూ ప్రెసిడెంటు గారింటి పాకీదొడ్డికూడా వూడ్చేవాడు. చలపతికూడా చిన్నతనంలో తండ్రి ఉద్యో గంచేసి వుండడంటారా? అందుకే వాడి కావయసులో బోదకాలు. డామిట్ అది చూస్తేనే నాకసహ్యం. పాపం వాళ్ళనాన్న ఎలాగైనా కొడుకుని పైచదువులు చదివిం చాలనుకున్నాడు. ఇంటర్ పరీక్షల్లోనే కాపీకొట్టిన వీడు పైచదువులేం చదువు తాడు చెప్పండి?'

నాకప్పుడు అర్థమైంది, చలపతి వెంకు బాబుఅంటే ఎందుకు భయపడేవాడో. తన తండ్రి వృత్తివివరాలూ, తను చిన్నతనంలో తండ్రితోబాటు వీధులూడ్చిన విషయం అప్పటినుంచీ తనకావ్యాధి సంక్రమించిన వైనం వెంకుబాబుకు తెలుసు. ఆ విష యాల్ని వెంకుబాబు బయటపెడితే తను

అల్లరి పిలవుతానని, తోటి స్నేహితులు తనని చులకనగా చూస్తారని చలపతి భయం. గౌరవ కుటుంబంలో పుట్టిన వెంకుబాబు అలాంటి చలపతిని రూమ్మే టుగా వుంచుకోడానికి ఇష్టపడలేదు. కాని వారిద్దరూ ఒకేరూంలో ఉండడం తప్ప నందున, అందుకు ప్రతీకారంగా వెంకు బాబు చలపతిని అలా వినియోగించు కున్నాడు.

దొంగతనం చేసినవాడు 'దొంగ, దొంగ' అని ముందుగా అరిచినట్లు, చలపతి ధర్మమా అని ఇంటర్మీడియెట్ పాసయి, ఇప్పుడు చలపతే కాపీ చేశాడంటున్న వెంకు బాబుపై నాకు అసహ్యమూ కల్గింది, కోపమూ వచ్చింది. కాని ఏం చేయగల్ను?

*

గతం కథ చలపతిపై ఎలాంటి ముద్ర వేసిందో తెలుసుకోవాలనిపించి చలపతిని అడిగాను మొన్న. 'వెంకుబాబు గుర్తు న్నాడా? ఇప్పుడెక్కడ వుంటున్నాడు?'

'వెంకుబాబును మర్చిపోవడమా? బలే వారండీ మీరు. అతను నాకెంతో మేలు చేశాడు. అతన్నెలా మర్చిపోగలను?'

'డిబార్ చేయించడమా మేలు?'

'నిజం. నన్ను డీబార్ చేయకుండా వున్నట్లయితే నేనలాగే చదువుకొనసాగించే వాడ్ని. మహా అయితే గ్రాడ్యుయేట్ నయ్యే వాడ్ని. అదృష్టం కూడా కలిసివస్తే కుటుంబాన్ని పోషించుకునేపాటి ఉద్యో గమూ సంపాదించేవాడ్ని. కాని డీబార్ చేయబడటంవలన నేనేమయ్యానో చూడండి. పై చదువులకుపోయే అవకాశంలేక అమూల్య మైన హోమ్యో శాస్త్రాన్ని స్వయంగా అభ్యసించాను. నేను లాభం పొందటమే కాకుండా దేశంలో కొంతమందికైనా వైద్య వృత్తితో సేవ చేయకలుగుతున్నాను. వెంకు బాబు ఇప్పుడు ఎక్కడుంటేనేం. బ్రతకడ మనే ఫైన్ ఆర్ట్సు చిన్నతనంలోనే నేర్చు కున్నాడు. అతనే రంగంలోనైనా నెగ్గుకు రాగలడు'

'నిజం చెప్పావ్ చలపతీ! దెబ్బతిన్న వాడెప్పుడూ ఆ దెబ్బ తన మంచికే తగి లిందనుకుంటాడు. సహజమే. అలా అను కోకపోతే బ్రతకలేడు. కాని దెబ్బ కొట్టిన వాడి శక్తినే మెచ్చుకునే నీ క్షమాగుణం నిరుపమానం. గెల్చింది నీవే చలపతీ! హిపిప్.'

# 1972లో మీ రాశిఫలం

## సింహం

ప్రతి సంవత్సరం జూలై 23 వ తేదీ నుంచి ఆగస్టు 22 వ తేదీవరకు సాయన సూర్యుడు సింహ రాశియందు ఉంటాడు. కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించినవారు సింహరాశియందు జన్మించినవారుగా పరిగణింపబడుతున్నారు. జనన సమయంతో కాని నక్షత్రంతోకాని దీనికి నిమిత్తం లేదు.

1, 4, 10, 13, 19, 22, 28, 31 తేదీలలో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులకు మార్చి పరీక్షల కంటే సెప్టెంబరు పరీక్షలు అనుకూలంగా ఉంటాయి.

**జనవరి :**

ఏ వ్యవహారంలోను యితరులమీద ఆధారపడడం తగదు. వ్యతిరేకమైన వార్తలను వింటారు. వ్యాపారంలో కొంతమంది వ్యక్తులు మీ మీద నిందా ప్రచారం చేయగల ప్రమాదం ఉంది. ప్రయాణాల్లో శ్రమ కలుగుతుంది. ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. కుటుంబ వ్యవహారాల్లో అనవసరమైన వ్యయం జరుగుతుంది.

**ఫిబ్రవరి:**

పూర్తిగా నెరవేరేవరకూ యే వ్యవహారాన్నీ నమ్మడానికి అవకాశం లేదు. వ్యాపారంలో చేజిక్కిన ఫలితంతో సంతృప్తి పొందడం మంచిది. ప్రయాణాలు శ్రమమీద ఫలిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మార్పుల నిమిత్తం ప్రయత్నం చేయడానికి యిది సమయం కాదు. కొన్ని వ్యవహారాల్లో మిత్రుల సహాయం లభిస్తుంది. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**మార్చి :**

సహాయం చేస్తామన్నవారు సమయానికి తప్పుకోవచ్చును. వృత్తి వ్యాపారాల్లో ప్రయోజనం లేని శ్రమ కలుగుతుంది. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం రాగలదు. ఉద్యోగంలో ముఖ్యమైన నిర్ణయాలు వాయిదా వేయడం మంచిది. రాజకీయ వ్యవహారాల్లో ప్రతిపక్షాల సంచలనం పెరుగుతుంది. స్వల్ప అనారోగ్యం చేయవచ్చును.

**ఏప్రిల్**

ఈ నెల మీ కార్యక్రమాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. వృత్తిలో ప్రయోజనం గల వ్యక్తులను కల్సుకొంటారు. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. స్థిరాస్థి వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. సాంఘిక కార్యక్రమాల్లో మీ ప్రాముఖ్యత పెరుగుతుంది. దైవకార్యాలు నెరవేరతాయి. బంధువులకు సహాయం చేయగలరు.

**మే**

వృత్తిలో నూతనావకాశాలు లభిస్తాయి. ఇప్పుడు మీరు జరిపే వ్యవహారాలవల్ల ముమ్ముందు కూడా ఉపయోగం ఉంటుంది. సమయానికి యే ఒక విధంగా డబ్బు చేతికి రాగలదు. ఉద్యోగంలో అనుకూలమైన మార్పులు వస్తాయి. అన్ని వ్యవహారాల్లోను గౌరవ ప్రాబల్యాలు బాగా ఉంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

**జూన్**

కొన్ని వ్యవహారాల్లో మీరు యెంత మంచిగా ప్రవర్తించినా, అది యితరులకు చెడుగానే కన్పిస్తుంది. వృత్తి వ్యాపారాల్లో మీ శ్రమకు తగిన ఫలితం లభిస్తుం. సాహసముతో కూడిన వ్యవహారాలు మొత్తం మీద లాభిస్తాయి. అనేక వ్యయం జరగడంవలన ఆర్థికంగా ఒత్తిడి రాగలదు. కళా వైజ్ఞానికరంగాల్లో మీ కృషికి స్వల్పాటంకాలు వస్తాయి.

**జూలై**

సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది. వ్యాపారంలో వితాలాకు మనుష్యులే మిమ్మల్ని వ్యతిరేకిస్తారు. ఉద్యోగంతో మెప్పుకురాని కార్యభారాన్ని వహిస్తారు. ప్రయాణాల్లో ప్రయాస అధికంగా ఉంటుంది. దైవకార్యాలు నెరవేరతాయి. కుటుంబ వ్యవహారాల్లో అధిక వ్యయం జరుగుతుంది.

**ఆగస్టు**

ఈ నెలలో మీ కార్యక్రమాలు అనుకూలంగా నెరవేరతాయి. వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సుకొంటారు. కొన్ని వ్యవహారాల్లో సమయానికి మిత్రుల సహకారం లభిస్తుంది. ఉద్యోగంలో అధికారుల ఆదరాభిమానాలను పొందగలరు. శుభకార్యాల విషయంలో అనుకూలమైన సంఘటనలు జరుగుతాయి. ఆరోగ్యం బాగుంటుంది.

**సెప్టెంబరు :**

వృత్తిలో ఆదాయం పెరుగుతుంది. సమయానికి ఏదో ఒక విధంగా డబ్బు చేతికి రాగలదు. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. వ్యాపారంలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. స్థిరాస్థి వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి. నూతన వ్యవహారాలు లాభదాయకం ఉంటాయి. బంధుమిత్రులను కల్సుకొంటారు.

**అక్టోబరు :**

వృత్తి వ్యాపారాల్లో మీ ఆలోచనలకు తగిన అవకాశాలు లభిస్తాయి. ఆర్థిక వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. మిత్రులకు సహాయం చేస్తారు. రాజకీయ వ్యవహారాల్లో అనుకూలమైన మార్పులు వస్తాయి. ఏ వ్యవహారంలోను తొందరపడి వాగ్దానాలు చేయడం తగదు. వినోదకాలక్షేపాల్లో పాల్గొంటారు.

**నవంబరు**

వ్యాపారంలో పోటీదారి పోటీని యెదుర్కొని అనుకూలతను సాధించగలరు. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. ఇతరుల నిమిత్తం మీరు శ్రమకు గురికావలసి వస్తుంది. కొన్ని వ్యవహారాల్లో మొగమాటాలకు లొంగిపోవడం వలన చేజిక్కిన అవకాశాలను కూడా కోల్పోయే ప్రమాదం ఉంది. సజ్జన సాంగత్యం లభిస్తుంది.

**డిసెంబరు :**

భాగస్వాములతో కలసిచేసే వ్యాపారాల్లో శ్రమ కలుగుతుంది. మీకు ముమ్ముందు ఉపయోగించగల పరిచయాలు యేర్పడతాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు స్వల్పంగా లభిస్తాయి. వైజ్ఞానిక రంగాల్లో ఖ్యాతి లభిస్తుంది. విలాస వస్తువులు కొంటారు. ఆరోగ్యం బాగుంటుంది. సంతానానికి సౌఖ్య సంతోషాలు లభిస్తాయి.

## కన్య

ప్రతి సంవత్సరం ఆగస్టు 23 వ తేదీ నుంచి సెప్టెంబరు 22 వ తేదీ వరకు సాయన సూర్యుడు కన్యారాశియందు ఉంటాడు. కాబట్టి యీ తేదీల మధ్యను జన్మించిన వారు కన్యారాశియందు జన్మించిన వారుగా పరిగణింపబడు తున్నారు. జనన సమయంతోకాని నక్షత్రంతో కాని దీనికి నిమిత్తం లేదు.

1, 4, 10, 13, 19, 22, 28, 31 తేదీల్లో జన్మించిన వారికి యీ సంవత్సరం చాలా బాగుంటుంది.

విద్యార్థులు సాధారణంగా కృతార్థులు కాగలరు.

**జనవరి**

వృత్తి వ్యాపారాల్లో మీ కార్యక్రమాలు ఒడుదుడుకులు లేకుండా నెరవేరతాయి. ఉద్యోగంలో గౌరవ ప్రాబల్యాలు బాగుంటాయి. మీ కంటే పెద్దవారు కూడా కొన్ని వ్యవహారాల్లో మీ సహకారాన్ని కోరవలసి వస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. ప్రయాణాలు కొంచెం శ్రమ మీద ఫలిస్తాయి. పుణ్యకార్యాలు చేస్తారు. నూతన విషయాలను తెల్సుకొంటారు.

**ఫిబ్రవరి :**

మీరు యెంతో కృషి చేస్తేనేగాని యే వ్యవహారమూ సానుకూలపడదు. వృత్తి వ్యాపా

రాల్లో పోటీవారి పోటీ పెరుగుతుంది. రాజకీయ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. కొంత మంది వ్యక్తులు మిమ్మల్ని కవ్వించి కలహ ప్రసంగం తీసికొని రావడానికి ప్రయత్నిస్తారు. బంధువుల వ్యవహారాల్లో మీరు శ్రమపడినా, మాట దక్కదు.

**మార్చి :**

ఏ వ్యవహారంలోను ఆరంభంలో కను పించిన అనుకూలత ఆఖరు వరకు నిలవదు. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలకు ఆటంకాలు యేర్పడతాయి. ప్రయాణాలు శ్రమ మీద ఫలిస్తాయి. ముఖ్యమైన వ్యవహారాల్లో పొరవ చూపించడానికి యిది సమయంకాదు. విద్యావైజ్ఞానిక రంగాల్లో మీ కృషికి ఆటంకాలు యేర్పడి దర్పకొంటాయి.

**ఏప్రిల్**

కొంతమంది వ్యక్తులు మిమ్మల్ని మోసం చేయడానికి ప్రయత్నిస్తారు. వృత్తి వ్యాపారాల్లో ఆందోళనకు గురి కాగలరు. దూర ప్రయాణాలు వాయిదా వేయడం మంచిది. సాహసముతో కూడిన వ్యవహారాలో నష్టం వస్తుంది. కుటుంబ వ్యవహారాల్లో చికాకులు యేర్పడతాయి. వ్యతిరేకమైన వార్తలను వింటారు. నెల ఆఖరులో కొంచెం బాగా ఉంటుంది.

**మే :**

ఈ నెలలో మీ కార్యక్రమాలు అనుకూలంగా ఉంటాయి. వ్యాపారంలో మీ ఆలోచనలు లాభదాయకంగా ఉంటాయి. వృత్తిలో ప్రయోజనం గల పరిచయాలు యేర్పడతాయి. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. రాజకీయ వ్యవహారాలు బాగా ఉంటాయి. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

**జూన్**

వృత్తి వ్యాపారాల్లో, మీ అంచనాలు సరియైనవని రుజువు కాగలవు. స్థిరాస్తి వ్యవహారాలు బాగా ఉంటాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి. బంధువుల వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు అనుకూలంగా ఉంటాయి. ఆరోగ్యం బాగుంటుంది. పుణ్యకార్యాలు చేస్తారు.

**జూలై**

ఈనెల అన్ని వ్యవహారాల్లోను జాగ్రత్తగా వ్యవహరించడం అవసరం. ఇతరులు చేసిన పొరపాట్ల వల్ల మీకు కూడా యిబ్బంది కలుగుతుంది. మీ తాలూకు వస్తువులు పోయే ప్రమాదం ఉంది. డబ్బు యిచ్చి పుచ్చుకోవడాల్లో చికాకులు రావచ్చును. సాహిత్య కళారంగాల్లో మీ కృషికి స్వల్పాటంకాలు వస్తాయి. అధికవ్యయం జరుగుతుం.

**ఆగస్టు :**

వృత్తి వ్యాపారాల్లో అనుకోని విధంగా వ్యతిరేకత యేర్పడుతుంది. మీ తాలూకు మనుష్యులను కూడా విశేషంగా నమ్మడం తగదు. సాహసము కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. ఉద్యోగంలో చికాకులు యేర్పడతాయి. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. ప్రయాణాలు వాయిదా పడతాయి.

**సెప్టెంబరు :**

అన్ని వ్యవహారాలు అనుకొన్నట్లుగా నెరవేరుతాయి. వృత్తిలో పోటీవారి పోటీ తగ్గుతుంది. ఇదివరకు మీకు కొన్ని వ్యవహారాల్లో యేర్పడిన సందేహాలు తొలగిపోతాయి. ముఖ్యమైన వ్యవహారాల్లో మిత్రుల సహకారం లభిస్తుంది. పోటీవారిలో గౌరవం బాగా ఉంటుంది. శుభకార్యాల విషయంలో మీ ఆలోచనలకు అనువైన సంఘటనలు జరుగుతాయి.

**అక్టోబరు :**

భాగస్వాములతో కలిసి చేసే వ్యాపారాలు బాగా ఉంటాయి. మీ ప్రయత్నాలు నిరాటంకంగా నెరవేరతాయి. సమయానికి యేదో ఒక విధంగా డబ్బు చేతికి రాగలదు. కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. సాహిత్య కళారంగాల్లో మీకృషి రాణిస్తుంది. ప్రయాణం ద్వారా కార్యసాధన చేయగలరు. విలాస వస్తువులు కొంటారు.

**నవంబరు :**

ఈ నెలలో మీ కార్యక్రమాలు చురుకుగా సాగుతాయి. అధికారుల వలన జరగవలసిన వ్యవహారాలు అనుకూలంగా ఉంటాయి. కోర్టు వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మిత్రులకు సహాయం చేస్తారు. సంతోషకరమైన వార్తలను వింటారు. రాజకీయ వ్యవహారాల్లో మీ ప్రయత్నాలు ఫలిస్తాయి.

**డిసెంబరు :**

ఇతరుల నిమిత్తం మీరు శ్రమ. పొందవలసి వస్తుంది. వ్యాపారంలో యెవరిని విశేషంగా నమ్మడం తగదు. మీకు ముమ్ముందు ఉపయోగించగల ఆలోచనలు చేయగలరు. ఉద్యోగంలో గౌరవప్రాబల్యాలు బాగుంటాయి. ప్రయాణాలు ఫలిస్తాయి. దైవకార్యాలు నెరవేరతాయి. బంధుమిత్రులను కలుసుకొంటారు.

**—మహేష్**

**(పైవారం: తుల, వృశ్చికం)**



# క్రీమ్ బిస్కట్ బాస్



'బాస్ వున్నారా?'

సీరియస్‌గా టైపు చేసుకుంటున్న లత మాటలు వినిపించటంతో తలెత్తి చూసింది.

గ్రేకలర్ సూటులో హుందాగా నిల్చొని వున్నాడు ఆ యువకుడు.

అతను యిందాక అడిగింది టైపు చేస్తున్న శబ్దంలో వినలేదు కాబట్టి అడిగింది నవ్వుతూ

'ఏం కావాలి మీకు?' అని.

'మీ బాస్ ... అదే రాజగోపాలరావు గారు...'

'మీ పేరు...' లత సందిగ్ధంగా అడుగు తుండగనే పూర్తిచేశాడు అతను.

'రమేష్!

'హా! బాస్ ఏదో అర్జంటు పనుండి బయటికెళ్ళారు. కాని వెళ్ళేటప్పుడు మీ గురించి చెప్పారు. రావడానికి పదిహేను నిముషాలు పడుతుందట. కొంచెం వెయిట్ చెయ్యాలి మీరు. ఈలా కూర్చోండి.'

తన టేబుల్‌కు ఎదురుగావున్న కుర్చీ చూపించింది లత.

'థ్యాంక్యూ!' అంటూ కూర్చున్నాడు అతను.

అతను కూర్చోగానే లత మరీ టైపు చెయ్యడంలో నిమగ్నమై పోయింది.

రమేష్‌కేం తోచలేదు.

చుట్టూ చూస్తూ కూర్చున్నాడు.

లత వున్నగది పర్సనల్ సెక్రటరీకి వున్న ప్రత్యేకమైనగది. చాలా చిన్నది. వో వైపు పెద్ద బీరువా. అందులో ఫైళ్లన్నీ నీటుగా సర్దివున్నాయి. యింకో వైపు పార్టీషను చేసినట్లు బ్లూ కర్టెను వేసివుంది. ఎదురుగా అటువైపు పెద్ద కిటికీ. కిటికీలోనుండి చూస్తే బయట అంతా కన్పిస్తుంది.

తల త్రిప్పి యిటుచూస్తే క్లర్కు రామ నాధం సీటు, హెడ్‌క్లర్కు రమణమూర్తి సీటు...లేడీ టైపిస్టు ఏంజిల సీటు... మిగతావాళ్ల సీట్లన్నీ కన్పిస్తాయి.

వాళ్లందర్నీ ఒక్కొక్కళ్లనే పరీక్షగా చూసేశాక కళ్ళుత్రిప్పి లతవైపు చూశాడు రమేష్.

ఎదురుగ్గా వో మనిషి వున్నాడన్నమాటే మర్చిపోయి టైపు చేసుకుపోతూ వుంది లత.

సన్నగా పొడుగ్గా తెల్లగా వుంటుంది లత. కోలమొహం.

మరీ అంత పెద్దది కాకపోయినా మరీ చిన్నవికూడ కాని కన్నులు. చిన్న నోరు. లేత పెదవులు. తెల్లటి దేహచ్ఛాయ. దేహ చ్ఛాయలో కలిసిపోయేట్లున్న లైట్ క్రీమ్ కలర్ చీర వేసుకుంది. అదే మ్యాచింగ్ జాకెట్టు. కీబోర్డు మీద సన్నగావున్న వ్రేళ్ళు సున్నితంగా కదులుతున్నాయి.

లతనే పరీక్షగా చూస్తున్న రమేష్ లత కళ్లెత్తేసరికి వులిక్కిపడ్డాడు.

తన వులికిపాటును గమనించిందో లేదో గాని చిన్నగానవ్వి, 'ఒన్‌మినిట్ ప్లీజ్!' అంటూ లేచి కర్టెనుకు అటువైపు వెళ్లింది లత.

వెళ్తున్న లతనే చూస్తున్న రమేష్‌కు పెద్దగా, ఫ్యాషన్‌గా చుట్టిన లత సిగ

అందంగా కన్పించింది.

వెళ్ళిన అయిదు నిముషాలకు తిరిగి వచ్చింది లత.

లత చేతిలో వో చిన్న గాజుప్లేటు— యింకో చేతిలో జ్యూస్‌గ్లాసు వున్నాయి.

ఆశ్చర్యపోయాడు రమేష్!

'ప్లీజ్ టేకిట్!' అంటూ టేబిల్‌కు అటు చివర పెట్టింది.

తను ఆఫీసు పనిమీద యిక్కడికి వస్తే యిలా...యింత అందమైన అమ్మాయి ముందు...ఆ అమ్మాయి చేతుల్తో ఆతిథ్యం.

బాగానే వున్నా సందిగ్ధంలో పడ్డాడు రమేష్.

యింకా సందిగ్ధంలో వుండగానే యింకో సారి హెచ్చరించింది లత.

'పదిహేను నిముషాలైపోయింది. బాస్ యింకా రాలేదు యిక వచ్చేయ్యవచ్చును కూడాను. అంతవరకు యివి తినుకుంటూ వుండండి.'

ఈసారి లత మొహంలోకి యింకా పరీక్షగా చూశాడు రమేష్!

అందులో తను ఆశించిన ఆప్యాయతేం కన్పించలేదు.

అదేదో డ్యూటీచేస్తున్న భావం తప్ప యింకేంలేదు.

పెట్టినవి తినకుండా తన వైపలా చూస్తున్న రమేష్ అంటే కొంచెం చిరాకేసింది లతకు.

'యిలా...ఏమిస్ యిక్కడకు వచ్చిన వాళ్ళందరికీ యిచ్చి ఆఫర్ చేస్తుంటారా?'

'అబ్బే! లేదండీ! మీకోసం ప్రత్యేకం' నిజమే అయినా చెప్పే విధానంలో కొంచెం వ్యంగ్యం తొణికిసలాడింది.

అంత పెడసరపు జవాబుకు కొంచెం కలవరపడ్డాడు రమేష్. మారు మాటాడకుండా ప్లేటువైపు చూశాడు.

చాక్‌లేట్ క్రీమ్ బిస్కట్లు!

సున్నితంగా ఒక్కొక్కటే తీసుకున్నాడు.

లత మరీ టైపు చెయ్యడంలో మునిగి పోయింది.

కాని ముందులా కాకుండా ఈ సారి మధ్య మధ్యలో తననుకూడ గమనిస్తున్నదేమో అన్న అనుమానం వేసింది.

జ్యూస్ పూర్తి చేసేలోగా బాస్ వచ్చారు.

## క్రీమ్ బిస్కట్ బాస్

రమేష్‌ను చూస్తూనే ఆప్యాయంగా వచ్చి షేక్‌హ్యాండ్ యిచ్చారు.

బిస్కట్లు, జ్యూసూ యిచ్చి తన అతిథిని సత్కరించిన లతవైపు మెచ్చుకోలుగా చూశారు.

తర్వాత తనకంటే వో నాల్గు అంగుళాలు పొడుగ్గావున్న రమేష్ భుజాలచుట్టూ ఆప్యాయంగా చెయ్యేసి లోపలికి తీసికెళ్ళి పోయారు.

వాళ్ళ ఆప్యాయతకు కొంచెం ఆశ్చర్య పోయినా చిన్నగా నవ్వుకుంది లత.

ఆ రోజు ఆదివారం.

మధ్యాహ్నం పూట మరీ ఖాళీగా వుంటుంది కాబట్టి ఆసలేం తోచలేదు.

లిటిల్ ఆనంద్‌లో మంచి హిందీ పిక్చరువుంటే వెళ్ళాలని నిర్ణయించుకున్నారు ముగ్గురూ.

పొడవైన తన నల్లని జడను రబ్బరు బ్యాండ్లు పెట్టి, చిన్న జరీ అంచువున్న వెంకటగిరి ఆకుపచ్చ చీర కట్టుకొని, చాల అందంగా తయారైంది లత.

సుశీల, ప్రభ — లత ఫ్రెండ్సు.

## ఓం నమః శివాయః

కం. పండు ముత్తైదువను పల్కుమన్న
పాతివ్రత ప్రభ ప్రజ్వలించి ప్రకటించెదన్
పిల్లలను గన్నతల్లినన్న
పీతాంబరాభరణాలొల్ల లావణ్యా.

కం. పుట్టుట గిట్టు టేగదన్న
పూలు పరిమళం లేని ముదువరుముదితల్
వ్వ, ప్రకృతి ధర్మంబిదేమొ
స్వార్థ ప్రబంధలు, గ్రంధలు పఠింప
లేనిదుఃఖినీ.

కం. పెంకుటింట్లో పెన్నిధున్నదన్న
పేదలకు పెద్దమేడలొద్దు, గుడిసిగదన్న
పై మెరుగులు పెద్దలకన్న
నాగరుగకు దనికులకు లోభత్వ లేల్ని
రికోర్

కం. పోవునే పుట్టుక బుద్బుద్
పొడరద్దిన పోవునే లబ్ధం లోభత్వముక్
పందులకేల సుగంధము
మహాస్వాన్నదకవనమని నిందింతురునిధుల్.

—రచయిత్రి: శ్రీమతి సరస్వతి గిరి

బి. యస్సీ. వరకు ఒకచోటే కాలేజీలో కలిసే చదివారు.

లతకు అంతకంటే ఎక్కువ చదవా లన్పించ లేదు.

ఉద్యోగం చెయ్యాలన్పించింది.

ఎందుకో ఉద్యోగంలో వున్నంత గ్లామర్ చదువులో లేదనిపించింది.

బి. యస్సీ. పాసైన మరుక్షణం మంచి రికమెండేషనులో ఆఫీసులో పర్సనల్ సెక్రటరీగా చేరిపోయింది.

సుశీలకు యం. యస్సీ.లో సీటురాలేదు. యం. ఏ. ఫిలాసఫీలో సీటు యిస్తామన్నా చేరాలన్పించలేదు. బోర్ అన్పించింది.

యింట్లో ఖాళీగా వుండటం యిష్టం లేక నర్సరీ స్కూల్లో టీచరుగా చేరింది.

యిక ప్రభ ముగ్గురన్నయ్యలకు ఒక్కతే చెల్లెలు.

వాళ్ళకు తమ చెల్లెలు డాక్టరు అవ్వాలని మహాకోరికగా వుండేది. సీటు రాకపోయేసరికి కనీసం పి. హెచ్. డి. డిగ్రీ తీసుకునైనా డాక్టరు కావాలని అభిలాష.

తనకు యిష్టమున్నా లేకపోయినా యం. యస్సీ. లో జాయిన్ అయ్యింది.

లత స్వతహాగా కాస్త అల్లరిది.

తన ముందునుండి పోయిన ప్రతి మనిషిని కామెంట్ చెయ్యకుండా వదిలి పెట్టదు, అందంగా వున్నా లేకపోయినా ఏదయినా సరే.

ప్రభ కామెంట్ చెయ్యకపోయినా లతకు సహాయంగా వుంటుంది. చెప్పిన ప్రతిదాన్ని చిరునవ్వుతో ఆమోదిస్తూ వుంటుంది.

సుశీల అన్నీ విని సున్నితంగా నవ్వేస్తూ వుంటుంది.

థియేటర్లోకి వెళ్ళి కూర్చున్నారు.

లైట్లు ఆరిపోయాయి.

న్యూస్ రీల్ ఏదో చూపుతున్నారు.

తమ ముందు సీటులోని బెల్‌బాటమ్స్, లుంగీల కాలేజీ స్టూడెంట్లు పిద చిన్నగా కామెంట్లు చేస్తూ, ఉత్సాహంగా కబుర్లు చెప్తూ వుంది లత.

వున్నట్టుండి తన ప్రక్కనున్న ఖాళీ సీటులో ఎవరో అతను వచ్చి కూర్చోవడంతో తన స్వేచ్ఛకు ఆటంకం కలిగినట్లు కొంచెం విసుక్కుంది లత.

పిక్చరు మొదలు పెట్టారు.

కొంచెంసేపు మౌనంగానే వున్నా తర్వాత

మానవుని అన్వేషణలు



## ప్రపంచానికి భారతదేశపు అమూల్యకానుక

అనేక శతాబ్దాల క్రింద ఏదయినా లెక్కించవలసివస్తే రాళ్ళనుపయోగించేవారు మానవులు. క్రమంగా అదిమానవుని వేళ్ళతో లెక్కించడం మొదలుపెట్టాడు. కాని, వేళ్ళతోనయితే పదికి మించి లెక్కించడం వీలుకాలేదు.

అన్ని సంఖ్యలనూ పది సంకేతాలతో లెక్కించడం అన్నది-ప్రపంచానికి భారతదేశం ఇచ్చిన వరప్రసాదం ఈ సంకేతాలన్నిటిలోనూ "సున్న"—అతి సూక్ష్మమైనదీ, అయినా మానవాళికి భారతదేశపు కానుకలలో అతి విలువయినదీను; ఆకాలంలో వైదిక పూజలో యజ్ఞగుండం ఒకభాగముగా వుండేది, ఆ గుండపు చతురస్రాకారంనుండి ఈ సంకేతాలుద్భవించాయి. ఒక్కొక్క సంకేతానికి నిహితమైన విలువనూ, అధిష్ఠించేస్థానాన్ని ఇచ్చేవిలువనూ ఇచ్చారు.

| 1 | 2 | 3 | 4 | 5 |
|---|---|---|---|---|
| 6 | 7 | 8 | 9 | 0 |

అశోకచక్రవర్తి కాలంలో (క్రీ. పూ. 273-232) భారతదేశంలో ఈ అంకెలను వాడుతుండేవారు. వెయ్యేళ్ళ తర్వాత, మహమ్మద్ ఇబ్న్ మూసా ల్-ఖవరాజ్మీ ద్వారా ఈ అంకెలు బాగ్దాద్‌లోకి ప్రవేశించాయి. అక్కడనుండి యూరపులోకి వ్యాపించాయి.

ఈ సంకేతాల పుణ్యమా అని లెక్కించడం సులభమూ, సరళమూ అయింది; అంతకు ముందు లెక్కించడానికి వీలు కాని దానిని లెక్కించ వీలయింది.

కాలంతోబాటు మానవుని గణితసమస్యలు సంక్లిష్టం కాసాగాయి; వాటి పరిష్కార మార్గాలూ సంక్లిష్టమయ్యాయి. ఈ నాడు మానవుడు క్లిష్టాతిక్లిష్టమయిన లెక్కలను అత్యద్భుతమైన సాధనాలతో త్రుటిలో పరిష్కరించ గలుగుతున్నాడు. ఇట్లా అపూర్వమయిన విధాలలో సమస్యా పరిష్కారానికి అతడికి తోడ్పతున్నాయి కంప్యూటర్లు.

ఐ బి ఎం వారికంప్యూటర్లు భారతదేశపు మొదటి కంప్యూటర్లు; భారతదేశం తన అశేషమయిన వనరులను సద్వినియోగం చేసుకుని సంపదతో, సమృద్ధితో తులతూగేందుకు ఇవి తోడ్పడుతున్నాయి. పరిశ్రమలు, వాణిజ్యము, బ్యాంకింగ్, రైల్వేలు. విద్యాపరిశోధనవంటి రంగాలలో సాయపడడమేకాక ఈ కంప్యూటర్లు అధిక దిగుబడులనిచ్చే మేలి విత్తనాల ఎన్నికలోనూ తోడ్పడుతున్నాయి.

మానవుడిశక్తి పెంపుదలకై—జీవనరంగాలన్నిటిలోను ప్రగతి ప్రయత్నాలన్నిటిలోనూ కంప్యూటర్లను వాడుతున్నారు.

**IBM**

వుండలేకపోయింది లత.

అటు ప్రక్కకు ఒరిగి ప్రభతో చిన్న చిన్నగా మాట్లాడుతూనే వుంది.

ప్రక్కతను పిక్చరు చూస్తున్నా, ప్రక్కలో గుసగుసలుగా విన్పించే కబుర్లకు విసుక్కున్నాడు.

కబుర్లు చాలవన్నట్లు హీరో హీరోయిన్ల మీద పర్సనల్ కామెంట్లు!

హోఁ! యిల్లాంటి వాళ్ళు యింట్లో హాయిగా కబుర్లు చెప్పకోక పిక్చరుకు ఎందుకొచ్చినట్లు?......

మెల్లిగా కళ్ళు త్రిప్పి ప్రక్కనున్న అమ్మాయిని చూశాడు.

చీకట్లో సరిగ్గా కన్పించలేదు.

లత ప్రక్కనున్నతని యిబ్బందిని గమనించినా మధ్య మధ్యలో తన వైపు చూస్తున్నందుకు పట్టించుకోనట్లు నిర్లక్ష్యంగానే వుండిపోయింది.

యింతలో యింటర్వెల్ అయ్యింది.

లైట్లు వెలిగాయి.

కళ్ళు త్రిప్పి ప్రక్కనున్నతన్ని చూసిన లత ఆశ్చర్యపోయింది.

రమేష్‌కూడ అంతే ఆశ్చర్యపోయాడు.

ఆశ్చర్యంలోంచి తేరుకొని తెలిసిన వ్యక్తి గదా అని చిరునవ్వును పెదవులమీదకు తెచ్చేలోగానే మొహం త్రిప్పేసుకొని, విసురుగా లేచిపోయింది లత.

లత విచిత్ర ప్రవర్తనకు అర్థం తెలియక భుజా లెగరేసుకున్నాడు రమేష్,

నవ్వి 'హలో!' అనకపోతే మానే!

కొంచెం మందహాసం చేస్తే ఆవిడ సొమ్మేం పోతుంది. ఏదో బద్ధ శత్రువును

# క్రీమ్ బిస్కట్ బాస్

చూసినట్లు మరీ అంత విసురుగా లేచి పోవాలా?

సినిమాకు వచ్చానన్న సంతృప్తి యిగిరి పోయినా, లత ప్రవర్తనతో ఏమిటో తెలియని అనుభూతి లాంటిది కలిగింది.

లేచివెళ్ళి సిగరెట్ కాల్చుకొని, కొంచెం ఉత్సాహం తెచ్చుకొని మరీ వచ్చాడు థియేటర్లోకి

అప్పటికి లతవాళ్ళు వచ్చివున్నారు.

కాని ఈసారి లత తనసీట్లో కూర్చోలేదు. ప్రభను యివతల కూర్చోబెట్టి తను అవతల కూర్చుంది.

రమేష్‌కు ఆ సీట్లో కూర్చోవాలన్పించలేదు.

అయినా థియేటర్ హౌస్‌ఫుల్ అవటంతో గత్యంతరంలేదు. వెళ్ళి కూర్చున్నాడు.

మరీ పిక్చరు మొదలైంది.

కాని ఆశ్చర్యమేమంటే అటువైపు నుండి ఎటువంటి కామెంట్స్, కబుర్లూ విన్పించలేదు.

లత యించుమించు మాటలు రాని దానిలాగే పిక్చరు చూడసాగింది.

రమేష్‌కు యిది నచ్చలేదు.

పైగా బాదేసింది కూడ.

తనప్రక్కలో కూర్చోని పిక్చరులోని మాటలు విననివ్వకుండా ఒకటే బోర్ కొట్టించిన వ్యక్తి లత అని తెలియగానే పిక్చరు చివ్వరిభాగం కన్నా ముందుభాగమే బాగున్నట్లు తోచింది రమేష్‌కు.




పిక్చరు అయిపోయింది.

ఆ రోజు బిస్కట్లు, జ్యూస్‌యిచ్చి అతిథి సత్కారం లాంటిది ఘనంగా జరిపిన, ఆ అమ్మాయేనా ఈరోజు 'అసలు ఈ జన్మలో ఈ వ్యక్తిని చూశానా?' అన్నంత యిదిగా తెలియనట్లు వెళ్ళిపోతూంది అనుకున్నాడు రమేష్ తన ప్రక్కనుండే విసవిసా నడిచిపోతున్న లతను చూసి.

•

పదిహేను రోజులు గడిచి పోయాయి.

ఆరోజు మధ్యాహ్నం ఆఫీసులో పని చేసుకుంటూ వుంది లత. బాస్ యింకా రాలేదు.

అంత క్రితమే నో అర్ధగంట లేటుగా వస్తానని ఫోనుచేశారు.

ఆ రోజు ప్రొద్దున బాస్‌చెప్పిన మ్యాటర్నంతా తాపీగా టైపుచేస్తూ వుంది లత.

అడుగుల చప్పుడుకు తలెత్తిన లత కొంచెం ఆశ్చర్యపోయింది:

వచ్చినతను రమేష్!

చిన్నగా నవ్వాడు.

'బాస్...'

'లేరు!'

అతను నిల్చోనే వున్నాడు.

ఆరోజు బాస్ అతని భుజాలచుట్టూ చెయ్యివేసి ఆప్యాయంగా లోపలికి తీసికెళ్ళిన సంఘటన జ్ఞప్తికి వచ్చింది.

బావుండదనుకొని 'బాస్ రావడానికి యింకో అర్ధగంట పడుతుందను కుంటాను వెయిట్ చెయ్యాలనుకుంటే కూర్చోండి.' అంది కుర్చీ చూపుతూ.

'థ్యాంక్స్!' చెప్పి అతను కూర్చున్నాడు.

పదినిముషాలు మౌనంగానే దొర్లిపోయాయి.

లత ఎంతసేపటికీ యిటు చూడక పోయేసరికి చొరవచేసి తనే పిల్చాడు.

'మిస్...!' అని

లత తలెత్తి ఏమిటన్నట్లు చూసింది.

లత చూపులకు కొద్దిగా హడలి పోయినా, చిన్నగా నవ్వుకున్నాడు.

'బయట చాల ఎండగా వుంది, కష్టం అనుకోకపోతే...ఒక్కగ్లాసు జ్యూస్...పోతే చల్లటినీళ్ళు...'

తల మున్కలయేంత ఆశ్చర్యపోయినా

పైకి తన భావాలనేమీ కన్పించనీయకుండా లోపలికెళ్లింది లత.

రమేష్ తనంతకుతానై అడిగినందుకు రమేష్‌ను అసభ్యంగా చిత్రీకరించుకో లేదు. రమేష్ మాటల్లోగాని, చిరునవ్వుల్లోగాని ఎక్కడా అసభ్యంగాలేదు.

'థ్యాంక్స్!' జ్యూసుగ్లాసు అందుకుంటూ చెప్పాడు రమేష్.

'అన్నట్టుపోయిన సారి చెప్పడం మర్చిపోయానండీ! మీరిచ్చిన క్రీమ్ బిస్కట్లకు జ్యూసుక్కూడ థ్యాంక్స్!'

'నో మెన్షన్!'

తనసీటులో కూర్చుంది లత.

జ్యూస్ తాగాక గ్లాసు టేబుల్‌మీద పెడుతూ అన్నాడు.

'మీకు చాక్‌లెట్ క్రీమ్ సోల్జర్ కథ తెల్సా?'

లత ఆశ్చర్యంగా చూసింది రమేష్ వైపు.

రమేష్ నవ్వాడు.

'మీ మొహం చూస్తూంటేనే తెలుస్తూంది మీకు తెలియదని, నేను చెప్తా వినండి' మొదలుపెట్టాడు రమేష్.

'అది రాత్రి సమయం.

ఒకతను ఒకమ్మాయి గదిలోకి రహస్యంగా ప్రవేశిస్తాడు. అతను వో సోల్జరు. అతని చేతిలోని రివాల్వరునుచూసి భయపడి పోతుంది ఆ అమ్మాయి. కాని అతనేమో భయపడవద్దంటారు. తన దగ్గర రివాల్వరే గాని తూటాలు లేవంటాడు. పైగా యుద్ధరంగంలో తన దగ్గర తూటాలకు బదులు క్రీమ్ చాకలెట్లు పెట్టుకునే వుంటా నంటాడు. ప్రస్తుతం అయిపోయాయి కాబట్టి యింట్లో ఏమైనా చాకలెట్లు వుంటే పెట్టమంటాడు. ఆ అమ్మాయి పెడుతుంది......ఆ తర్వాత. వాళ్లిద్దరూ పెళ్లిచేసుకుంటారనుకోండి, కాని మధ్యలో ఆ అమ్మాయి అతనికి తన ఫోటో వెనక 'టు మై చాకలెట్ క్రీమ్ సోల్జర్!' అని వ్రాసి పంపుతుంది. దానివల్ల మరీ చాల రభస జరుగుతుందనుకోండి. అది వేరే విషయం...'

ఎంత సీరియస్‌గా వుందామనుకున్నా రమేష్ సందర్భాన్నిబట్టి కథ చెప్పే తీరును చూస్తే నవ్వాపుకోలేకపోయింది లత.

తెలియకుండానే పెదవుల మీద చిన్న మందహాసం వెలిసింది.

'అయితే నన్నుకూడ 'టు మై క్రీమ్ బిస్కట్...' అని ఫోటో పంపమంటారా?' అంది కొంచెం వెంకిగా.

'అబ్బే! అంతమాట చెప్పలేకపోయినా... పంపిస్తే అదృష్టవంతుణ్నే!'

లత మరీ సీరియస్‌గా అయిపోయింది.

అతను అంత చనువుగా మాట్లాడుతుంటే కొంచెం ఏడ్పించాలన్పించింది లతకు.

'మీకు తెలియదేమో! చెప్దామనుకుంటే అంతలోనే బాస్ వచ్చారు. ఆ రోజు మీకు క్రీమ్ బిస్కట్లు, జ్యూసు వూర్కనే యివ్వలేదు. వాటికి మీరు పే చెయ్యాలి...... ఈ రోజు త్రాగిన జ్యూసుక్కూడ...'

తలెత్తి చూసిన లతకు అయోమయంగా చూస్తున్న రమేష్ కన్పించాడు.

నవ్వొచ్చింది.

వస్తున్న నవ్వును బలవంతంగా ఆపుకుంటూ, 'వుండండి బిల్ తెస్తాను!' అంటూ కర్టెనుకు అవతలికి వెళ్లింది.

తిరిగి వచ్చే లోపల రమేష్‌తో షేక్ హ్యాండ్ యిస్తూ బాస్!

---

చాలా నొచ్చుకుంటున్నట్లు 'సారీ రమేష్! యింట్లో ఆవిడకు బాగాలేదు. ఎంత త్వరగా రావాలన్నా వీలుపడలేదు — రియల్లీ వెరివెరి సారీ! కమ్ విత్ మి.' అంటూ లోపలి కెళ్లిపోయారు.

బాస్ వెనకే పోతున్న వాడల్లా క్షణం పాటు వెనక్కి తిరిగిన రమేష్ లతవైపు కొంటెగాచూసి నవ్వి లోపలికెళ్లిపోయాడు.

ఉవ్వెత్తున లేచిన కోపాన్ని మరేం చెయ్యలేక అప్పటికప్పుడు కష్టపడి వేసు కొచ్చిన బిల్ మీద చూపించింది.

నలిపి చెత్తబుట్టలో పడేసింది.

లోపలి కెళ్లిన గంట లోపల మరీ బయటికి వచ్చారు యిద్దరూ.

తన దగ్గరకు వస్తూనే లేచి నిలబడింది లత.

ఈ సారి బాస్ పరిచయం చేశారు.

'ఈవిడ పర్సనల్ సెక్రటరి! లత! వెరి సిన్సియర్ గర్ల్!'

'ఈయన మీ క్రొత్త బాస్! పేరు తెలుసనుకుంటాను. రమేష్!' నవ్వుతూ పరిచయం చేశారాయన.

తను వింటున్నది కలో నిజమోకూడ అర్థం కాలేదు.

యాంత్రికంగా చేతులు జోడించింది లత.

హుందాగా తలవూపి, లతను గమనించ నట్లే బాస్ వెంట వెళ్లిపోయాడు రమేష్.

వెళ్తున్న రమేష్ వైపే బొమ్మలా చూస్తూ వుండిపోయింది లత.

అమెరికాలో యింత కంటే పెద్ద ఉద్యోగం వస్తున్నందుకు ఈ జాబ్ రిజైన్ చేసి బాస్ వెళ్లిపోతారన్న సంగతి తెలుసు!...

అది కూడ యింకో వారం రోజుల్లో అని కూడ తెలుసు!...

కాని తమకు రాబోయే క్రొత్త బాస్ రమేష్ అని మాత్రం తెలియదు.

'యితనా బాస్!' అనుకుంది లత, అంతకుముందే రమేష్ మాట్లాడిన ప్రతి మాటా, చెప్పిన కథా గుర్తుకు తెచ్చు కుంటూ.

క్షణంలో ఏదో నీరసం ఆవహించి నట్లనిపించింది.

అయిదు వరకు ఎలా గడిపిందో తెలియదు.

అయిదు అవుతూనే భారంగా యింటి

# క్రీమ్ బిస్కట్ బాస్

కెళ్లిపోయింది లత!

* * *

ఆ రోజు క్రొత్త బాస్ వచ్చే రోజు.

స్టాఫ్ అంతా ట్రిమ్‌గా డ్రస్సయి వచ్చింది.

మగవాళ్లందరూ ఎంచక్కా గడ్డాలు గీసుకున్నారు. సన్నగా, నీటుగా మీసాలు కత్తిరించుకున్నారు.

యిస్త్రీ బట్టల్లో చాల స్మార్ట్‌గా వున్నారు.

టైపిస్టు ఏంజిలి హాలీవుడ్ యాక్ట్రెస్లని మించిపోయింది.

తెల్లగా వుంటుందేమో యింగ్లీషు బొమ్మలా, ముద్దుగా కన్పించింది లత కళ్లకు.

సీనియరు టైపిస్టు అంబుజమ్మగారు పట్టుచీరలో చాల హుందాగా వున్నారు.

'స్టాఫ్ అంతా ప్రతి రోజు యిలాగే వుంటే ఆఫీసంతా ఎంతందంగా కలకల లాడుతూ వుంటుందో కదా!' అనుకుంది లత.

ముందు తానూ చాల అందంగా అలంక రించుకోవాలనుకుంది. క్రొత్త బాస్ —

అందులో యంగ్ జంటిల్‌మాన్ —

అతగాడికి తను పర్సనల్ సెక్రటరీ—

అంతలో రమేష్‌తో తనకున్న పరిచ యాన్ని గుర్తుకు తెచ్చుకొని నీరు కారి పోయింది.

అందరిలా తను అలంకరించుకుంటే... తన అలంకరణను చూసి రమేష్ ఏమన్నా అపార్థం చేసుకుంటే?!...

అందుకోసమే చాల సింపుల్‌గా తయా రయ్యింది.

లైట్ పింక్ కలర్ శారీ — మ్యాచింగ్ బ్లవుజు.

గడియారం పది కొట్టింది.

బాస్ చాల పంక్చువల్‌గా ఆఫీసులోకి అడుగుపెట్టాడు.

ఆఫీసు రూములోకి వెళ్లిన పది నిముషాలకు లతకు కబురు వచ్చింది.

తెలియకుండానే ఏమిటో భయంలాంటిది కలిగింది లతకు.

డోర్ తెరుచుకొని గుమ్మంలోకి అడుగు పెట్టుంటే కొద్దిగా కాళ్లు వణికాయి.

'ఛ! యిదేమిటి నేను?...తనమాత్రం పిచ్చిగా ప్రవర్తించలేదూ?'

తనకు తానే సమాధాన పర్చుకుంది.

లతను చూడగానే రమేష్ కళ్లు క్షణం పాటు తళుక్కున మెరిశాయి. అంతలో గంభీరంగా మారిపోయాడు.

'అయామ్ సారీ!' అన్న లత మాటల్ని విననట్లే,

'టేక్ యువర్ సీట్!' అని చెప్పేసి ఆ రోజు చెయ్యాల్సిన పనంతా చెప్పాడు.

ఆ పనంతా చూసేసరికి ఏడుపొచ్చినంత పనైంది లతకు.

'పాపం! పాత బాసే నయం.' అను కుంది చేతిలోని పేపర్లని పట్టుకొని యివతలికి వస్తూ.

దాదాపు నెల గడిచినా రమేష్ ప్రవర్తనలో మార్పేమీ రాలేదు.

రోజు వూపిరి పీల్చుకోలేనంత పని యివ్వడం......

వేళ్లు తెగిపోతాయేమో నన్నంత నొప్పులు పుట్టేట్లు టైపు చెయ్యడానికి మ్యాటర్ యివ్వడం......

వీటన్నింటికి తోడు అస్తమానం అదేదో ముంచుకుపోయినట్లు గంభీరంగా వుండటం...

బాస్ మొహం చూడాలంటేనే చాల చీకాగ్గా, చిరాగ్గా వుండేది లతకు.

ఆ రోజు అంత చనువుగా ... అచ్చం కాలేజీ స్టూడెంటుకు మల్లే బిహేవ్ చేసిన తను...ఒక్క చిర్నవ్వు...ఒక్కటంటే ఒక్క చిరునవ్వు నవ్వడేం?...

నిజంగానే బాస్ చిరునవ్వుకోసం ఆరాట పడిపోయేది లత.

ఆ రోజు పని మరీ ఎక్కువగా వుంది.

ఏ రోజు పని ఆ రోజు కంప్లీట్ చేసుకునే సిన్సియారిటీ వుండటంవల్ల ఆ రోజు ఆ పనంతా ముగించుకునే యింటికి వెళ్లాలనుకుంది లత.

అయిదయిపోయింది.

ఆఫీసులోని స్టాఫంతా ఒక్కొక్కళ్లే వెళ్లిపోయారు.

అయిదున్నర కూడా అయిపోయింది.

'యింకో అయిదు నిముషాలు వుంటే చాలు. పని అయిపోతుంది. ఇక వెళ్లొచ్చు.' అనుకుంది లత చివ్వరి పేపరును టైపు చేస్తూ.

ఎదురుగ్గా మనిషి నిలబడటంతో వులిక్కి

పడి తలెత్తింది.

రమేష్!...బాస్!...

ఒక్క క్షణం కలవరపడ్డా చప్పున లేచి నిల్చుంది.

'టైం ఎంతో తెలుసా?' వాచీ చూసుకుంటూ అడిగాడు రమేష్.

'అయిదున్నర.'

'మరి?!'

లత జవాబేం చెప్పలేదు.

కొన్ని క్షణాలు మౌనంగా వున్న తర్వాత మెల్లిగా అడిగాడు.

'వర్క్ చాల హెవీగా వుందనుకుంటాను.'

ఆ క్షణం రమేష్ కంఠస్వరం 'బాస్!' కంఠస్వరంలా లేదు. చాలమెత్తగా, మృదువుగా వుంది.

'ఆల్‌రైట్! రేపు చేసుకోవచ్చు! ఈ రోజు ఇక వెళ్లండి' అన్నాడు.

తలూపింది లత.

ఒకడుగు ముందుకు వేసినవాడల్లా మరీ వెనక్కి తిరిగివచ్చాడు.

'మీరు మర్చిపోయారేమో! ఆ రోజు మీ బిల్లు పే చెయ్యాలే లేదు. రేపు బిల్లు తెచ్చారంటే...'

ఆశ్చర్యంగా తలెత్తింది లత.

రమేష్ అసలేమీ తెలియనట్లు అమాయకంగా చూస్తున్నాడు. కళ్లల్లో లవ్ కొంటె చూపులు—

పెదవుల మీద అదే చిలిపి చిర్నవ్వు—

'రేపు యిదే వేళకి బిల్ యివ్వడం మర్చిపోకండి......వస్తా' వెళ్లిపోయాడు రమేష్.

అప్రయత్నంగా లత కళ్లల్లో నీళ్లు వచ్చాయి.

రెప్పల మధ్య అస్పష్టంగా గొణుక్కుంది లత.

'నువ్వు చాల చెడ్డవాడివి బాస్!' అని.

*  *  *

మరుసటిరోజు అయిదున్నర అయ్యింది.

ఆ రోజు పని అయిదుకే అయిపోయినా ఏదో పనున్నట్లు టైపుచేస్తూ అయిదున్నరవరకూ కూర్చుంది లత.

టైపురైటర్‌లో సెట్‌చేసిన పేపర్ని తీసి మిగతా పేపర్లతో కలిపి బొత్తిగా పెట్టి గుండెసూటి గుచ్చుతూవుంది.

యింతలో రమేష్‌వచ్చాడు.

'నిన్న మీ బిల్ పే చేస్తానన్నానుకదూ! ఈ కవర్లోవుంది. అయినంత చెల్లువేసుకొని మిగతాది రేపు యిచ్చెయ్యండి.'

టేబుల్‌మీద వో కవరుపెట్టి వచ్చినంత వేగంగానూ వెళ్లిపోయాడు రమేష్!

ఆశ్చర్యపోతూ కవరుతీసింది లత.

లోపలవున్న ఫోటోను చూస్తూనే యింకా ఆశ్చర్యపోయింది.

వెనక్కి త్రిప్పి చూసింది.

'టు మై క్రీమ్ బిస్కట్ సెక్రటరీ!' అని వ్రాసివుంది.

భద్రంగా ఫోటోను పర్సులోపెట్టుకొని బయటకు వచ్చింది.

ఫోటో పర్సులోవున్నా కళ్ళ ముందున్నట్లే కన్పించసాగింది రమేష్ అందమైన మొహం.

*  *  *

మరుసటి రోజు...

ఆఫీసులో బాస్‌కు వో కవరుతోపాటు వో కాగితంకూడ సమర్పించుకుంది సెక్రటరీ.

రాజీనామా కాగితాన్ని తీసుకుంటూ, లత కళ్ళల్లోకి చూస్తూ చిన్నగా నవ్వేడు రమేష్!

ఎర్రబడ్డ మొహంతో బయటికి వెళ్లిపోయింది లత.

టేబుల్‌మీదున్న కవరు అతి సున్నితంగా తీసుకొని కోటుజేబులో పెట్టుకున్నాడు రమేష్!

ఆ కవరులో ఏముంటుందో తెలుసు.

దానివెనక ఏం వ్రాసివుంటుందో వూహించడం అంత కష్టమేం కాదు. ●

# పెండింగ్ ఫైళ్లు

ప్రజల కోర్కెలు, సమస్యలు
తెలియాలంటె ప్రభుత్వానికి
పెట్టుకోవాలి పిటిషన్లు, దరఖాస్తులు
'అర్జీంతాలి'లో అధికార్లముందు.
వాటికి ఆకారం రావాలంటే
దిద్దాలి రూపురేఖలు నేర్పుతో
పరీక్షింపబడతాయి పలువిధాలుగా ఫైళ్ళు
అనేక అంతస్తుల్లో గుమాస్తాలచే.
చూస్తారు ఆఫీసర్లు రూల్సు ప్రకారం
వేస్తారు ఆర్డర్లు క్రిందివాళ్ళు "అవునం"టే.
ఆశ్చర్యంలో ఆశ్చర్యం
ఆ అర్జీ కాగితాల వింత ప్రయాణం
నెలలతరబడి, ఏండ్లతరబడి
చంక్రమణం చేస్తుంటాయి చాలా
గంతలు కట్టిన గానుగ ఎద్దులాగ.
క్షణాల్లో డిస్‌పోస్ అయిపోతాయి కొన్ని
తరతరాలుగా పెండింగ్‌లోవుంటాయి మరికొన్ని.
ఆఫీసర్లు, గుమస్తాలు ఎంతమంది మారినా
ఆ పెండింగ్‌ఫైళ్ళ ఎడ్ల బండి అక్కడే వుంటుంది.
జి. టి. ఎక్స్‌ప్రెస్, జెట్ విమానాలు కూడా బలాదూర్
'కొన్ని ఫైళ్ళ స్పీడ్‌ముందు
నత్తగుల్లలే రేసుకుక్కలు
కొన్నిఫైళ్ల మందగమనాలముందు.
పైవారు వేస్తారు ఏవేవో ప్రశ్నలు
క్రిందివారు 'పుటప్' చేస్తారు తోచిన జవాబులు.
పాపం! ఆ పిచ్చి పిటిషన్‌దార్లకు
ఇదంతా వో పెద్ద క్రాస్‌వర్డ్ మార్క్!
అర్థంగాని గొడవ, అవసరంలేని గందరగోళం!
పెండింగ్ ఫైళ్లంటే— పేదల బాధలు తీర్చడానికి
పెట్టుకున్న పిటిషన్ల దొంతరలే!
బూజు దుప్పటి కప్పుకుని అల్మారాసొరుగుల్లో
హాయిగా నిద్రపోతుంటాయి ఆ ఫైళ్ళు.
ఆ కుంభకర్ణుని నిద్రలేపడానికి,
వుంటాయి అంకుశాల్లాంటి రన్నింగ్ నోటు ఫైళ్ళు.
రన్నింగ్ నోటుఫైళ్లను నడపడానికి
చెక్కింగ్ రిజిస్టర్లు— వాటికి త్రేదీలు, కాలంలు.
పైవారు చెక్‌చేస్తే, పైకి అన్నీ బాగానే వుంటాయి,
ఆఫీసులో అన్నీ సరిగావున్నా,
అర్జీదారుని నోసట శని వుంటుంది.
పేదవారి బాధలు అలాగే పేరుకుని వుంటాయి
ఉద్యోగస్థుల జీతాలు నెలనెలకు వస్తూనే వుంటాయి.
పెండింగ్ ఫైళ్ళ బండి ప్రయాణం చేస్తూనే వుంటుంది పసులూ, లేసూ.
ఆఫీసర్లు దేవుళ్లో, కారో కాని
ఆఫీసులనే గుడి మంటపాల్లో
పడిగాపులు కాస్తుంటారు పేదప్రయాణీకులు
ఆశతో ఇంకా అవుతుంది పని అని.
ఫైళ్ళ గానుగ తిరుగుతూనే వుంటుంది
వాళ్ల ఆశలు అందులో నలుగుతూనే వుంటాయి.
(ఈ గేయం ఇంకా పెండింగ్‌లోనే వుంది)

—ఎల్. మాలకొండయ్య



'భార్యా బిడ్డలు'లో భార్యా భర్తలు !

# సినిమా

## లేని బాట వెదకిన పేదవాడు ! ఎవరు ?

రాజారావ్స్ కాటన్ మిల్స్‌కి మోహన్, ఎం. ఎస్. సి. మేనేజరు అయ్యాడు. గ్రామంలో భార్యా బిడ్డలను వదిలి, మోహన్ పట్నం వచ్చాడు. రాజారావ్స్ మిల్స్ వార్షికోత్సవం జరుగుతుంది. ఈ వుత్సవంలో వర్కర్లు అందరూ పాల్గొన్నారు. మోహన్ను పాట పాడమని మిల్లు యజమాని కుమార్తె రాధ ప్రాధేయ పడింది. ఆమె కోరికను మోహన్ మన్నించాడు. జీవితాన్ని, దాని మిట్టపల్లాలను, సుఖదుఃఖాలను సూచించే పాటను మోహన్ పాడాడు. ఏమని?

'లేని బాట వెదుకుతున్న పేదవానికి
రాని పాట పాడుతున్న పిచ్చివానికి
బ్రతుకు పూలబాట కాదు
అది పరవశించి పాడుకునే పాట కాదు'

అంటూ మోహన్ పాడిన పాటకు వర్కర్లు అందరూ కరతాళ ధ్వనులతో ప్రశంసించారు. ఇంతకీ ఈ ఘట్టం ఎక్కడ జరిగిందో మీకు చెప్పాలిగా. ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించిన 'భార్యా బిడ్డలు' చిత్రంలోనే. మోహన్‌గా అక్కినేని, రాధగా జయలలిత నటించారు.

యువదర్శకుడు తాతినేని రామారావు ప్రతిభావంతంగా దర్శకత్వం నెరపిన 'భార్యా బిడ్డలు' చిత్రానికి — ఆచార్య ఆత్రేయ కలం, వెంకటరత్నం ఛాయాగ్రహణం, మహదేవన్ సంగీతం, జయలలిత అందం, నాగేశ్వరరావు నటనా ప్రాభవం, సహాయ నటీనటుల సామర్థ్యం సమున్నతంగా ఉండటం వల్ల, నిర్మాత ఎ. వి. సుబ్బారావు భారీఎత్తున నిర్మించడం వల్ల, ప్రేక్షకుల వూహ మేరకు చిత్రం తయారయిందని చెప్పవచ్చు. ఈ రంగుల చిత్రం సంక్రాంతి కానుకగా నవయుగ ద్వారా విడుదలవుతుంది.



'అమ్మమాట'లో వాణిశ్రీ, శోభన్‌బాబు, 'కనుల భాష అంటే ఏమిటో?'

### రాజబాబు

## జేబులో రమాప్రభ

రాజబాబుకి రమాప్రభ అంటే చాల యిష్టం. ఆమె ఫోటోను తన పాకెట్లో పెట్టుకుంటాడు రాజబాబు. అతడికి ఒక చిన్న కారు వుంది. ఒకరోజు షికారు బయల్దేరాడు. రోడ్డుమీద నలుగురు అమ్మాయిలు కబుర్లు చెప్పుకుంటూ వుండడాన్ని రాజబాబు చూసాడు. కారును వాళ్ల దగ్గర ఆపాడు. 'అమ్మాయిలూ, ఆగండి ఆగండి, ప్లీజ్' అంటూ వెంటబడ్డాడు.

రాజబాబు వాలకాన్ని చూసి ఆ సుందరాంగులు విస్తుపోయారు. అతడ్ని ఎగాదిగా చూసారు. రాజబాబు ఒక్కొక్క అమ్మాయి ముఖం చూసి 'ఒరేయ్, ఎక్కడా చూసినా కాంతలే. నీకు కావలసిన కాంత మాత్రం దొరకదురా' అంటూ తన చేతనున్న రమాప్రభ ఫోటోను ప్యాంటు పాకెట్లోకి పంపాడు. 'ఎవడేవీడు' అంది ఒకతె. 'అమ్మాయిల పిచ్చోడు' అంది మరొకతె. మగువలు పకపక నవ్వారు. ఆ మాటలు, పకపకలు విన్న రాజబాబు 'విన్నావురా. ఈరోజుల్లో వర్కి వాల్యూ లేకుండా పోయింది. నావంటి గొప్ప తెలివిగల వారందర్నీ ప్రపంచం పిచ్చివాళ్లే అనుకుంటుంది. హాఁ' అంటూ నిట్టూర్చి

కారు స్టార్టు చేసాడు. 'కట్' అన్నాడు దర్శకుడు కె. ఎస్. రెడ్డి. కడుపుబ్బ నవ్వించే యీ సన్నివేశం కె. ఎస్. ఆర్. పిక్చర్స్‌వారి 'కొరడా రాణి'లో కనిపిస్తుంది.

'కొరడా రాణి' పాత్రను జ్యోతిలక్ష్మి, ఆమెకు జతగాడుగా రామకృష్ణ, దుష్టుడిగా ప్రభాకర్‌రెడ్డి, హాస్యగాడుగా రాజబాబు నటించే అత్యద్భుత సాహసోపేత చిత్రమే యిది. ఈ చిత్రానికి కృష్ణమోహన్ మాటలను, దేవరాజ్ ఛాయను, సత్యం సంగీతాన్ని, బి. ఎస్. క్రిష్ణ శిల్పాన్ని నిర్వహిస్తున్నారు.

## డైరెక్షన్ చేపట్టిన నృత్యదర్శకుడు

సినిమారంగంలో నృత్యదర్శకుడిగా పది సంవత్సరాల అనుభవం గడించిన కె. ఎస్. రెడ్డి 'కొరడారాణి'ని నిర్మించడమేగాక, దర్శకత్వాన్ని కూడా చేపట్టారు. ఈ చిత్రంలోని మరికొన్ని ప్రధానపాత్రలను సత్యనారాయణ, త్యాగరాజు, రామదాసు, రమాప్రభలు పోషించగా, దేవిక, బాలయ్య, ముక్కామల, శకుంతల అతిథి నటులుగా కనిపిస్తారు.

## జయశంకర్ అండ్ కో

తెలుగులో వెలిసిన మరొక కొత్త సంస్థ. తమిళంలో బాక్సాఫీస్ చిత్రంగా ప్రశంసలందుకున్న 'శపథం' చిత్రాన్ని తెలుగు ప్రేక్షకులకు చూపించే బాధ్యతను ఈ సంస్థ తీసుకుంది.

## నాగభూషణం ద్విపాత్రాభినయం

తమిళచిత్రం విజయవంతం అవడానికి ముఖ్యకారకుడు టి. కె. భగవతి ఆయన ధరించిన పాత్రలను తెలుగులో నాగభూషణం నిర్వహిస్తున్నారు. ఒకే రూపం కలిగిన అన్నదమ్ములుగా నాగభూషణం నటించే ఈ చిత్రంలో కె. ఆర్. విజయ, క్రిష్ణ రొమాంటిక్ పేర్‌గా కనిపిస్తారు. ఈ చిత్రానికి 'గూఢచారి 116' ఫేమ్ మల్లికార్జునరావు దర్శకుడు. సంగీతాన్ని జి. కె. వెంకటేశ్, ఛాయను ప్రకాశ్, రచన్ను రాజశ్రీ, కళను నాగరాజన్ నిర్వ



'మొనగాడొస్తున్నాడు జాగ్రత్త'లో జ్యోతిలక్ష్మికి కృష్ణ అభయం

హించే ఈ సాంఘికంలో అంజలీదేవి, పండరీబాయి. రాజబాబు ముఖ్యపాత్రధారులు. చిత్రనిర్మాణ నిర్వహణ బాధ్యతను వెంకన్నబాబు, కె. ఎస్. ఎన్. పంతులు నిర్వర్తిస్తారు.

## చలికాలంలో ఊటీ వెళ్ళిన నాగేశ్వరరావు, వాణిశ్రీ

ఇది ఎండాకాలం కాదు. విపరీతమయిన చలిరోజులివి. అయినా నాగేశ్వరావు, వాణిశ్రీలు ఊటీకి వెళ్ళారు. ఎందుకు? విశ్రాంతి కోసమా. కానేకాదు. మరి దేనికి? అవుట్‌డోర్ షూటింగులో పాల్గొనడానికే. పద్మశ్రీ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మించే సాంఘిక చిత్రం యొక్క మొదటి షెడ్యూలు ఊటీలో ప్రారంభమైంది. అక్కినేని, వాణిశ్రీలు నవంబరు 29నుండి డిశంబరు 5వరకు అక్కడ వుండి, రెండు పాటల చిత్రీకరణలో పాల్గొన్నారు.

'సిరిసంపదలు, ప్రేమించి చూడు' చిత్రాలను నిర్మించిన వి. వెంకటేశ్వర్లు భార్య



'బుల్లెమ్మ—బుల్లోడు'లో చలికాచుకుంటున్న చలం, విజయలలిత



రాజబాబు కుమారుని బారసాల రోజున విచ్చేసిన శివాజీగణేశన్‌తో రాజబాబు దంపతులు, వారి చిరంజీవులు, తల్లిదండ్రులు.

ప్రతిష్ఠాన తయారు చేసే ఈ రంగుల చిత్రానికి బహుముఖ ప్రజ్ఞాశాలి పి. పుల్లయ్య దర్శకుడు. ఈ చిత్రానికి ఆచార్య ఆత్రేయ రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, కె. ఎస్. ప్రసాద్ ఛాయను నిర్వహిస్తున్నారు. అఖిలభారత ప్రశస్తి పందుకున్న కె. ఎస్. ప్రసాద్, నాగేశ్వరరావు నటించే చిత్రానికి ఛాయాగ్రహణం వహించడం ఒక విశేషం.

## సినిమా

నాయకీ నాయకులుగా వాణిశ్రీ, అక్కినేని నటిస్తున్న పద్మశ్రీ పిక్చర్స్‌లో ఏస్వీరంగారావు, గుమ్మడి, రాజబాబు, లక్ష్మి, రమాప్రభ, శాంతకుమారి ముఖ్య పాత్రలను పోషిస్తున్నారు. ఇన్‌డోర్ షూటింగు హైద్రాబాదు సారథిలో డిశంబరు నుండి ప్రారంభమవుతుంది. నవయుగ విడుదల.

## సినిమా డైరీ

● రాజేష్ మూవీస్ వారి ఈస్ట్‌మన్ కలర్ క్రయిమ్ థ్రిల్లర్‌కి 'ఘరానా దొంగలు' అని నామకరణం జరిగింది. వాహినీలో నవంబరు 29 న జరిగిన షూటింగులో కాంతారావు, నాగభూషణం, సత్యనారాయణ పాల్గొన్నారు. చక్రవర్తి దర్శకుడు.

● మహాలక్ష్మి ప్రొడక్షన్స్ 'ప్రియ బాంధవి' షూటింగు నవంబరు 29, 30 ల్లో వాహినీలో జరిగింది. కృష్ణంరాజు, రాజసులోచన పాల్గొన్నారు. బి. ఎస్. నారాయణ దర్శకుడు.

● జయశంకర్ ఆర్ట్స్‌కో సాంఘికం నవంబరు 29 న వీనస్‌లో ప్రారంభమైంది. నాగభూషణం పాల్గొన్నారు. ఎం. మల్లికార్జునరావు దర్శకుడు.

● రవిశంకర్ పిక్చర్స్ 'ప్రొడక్షన్ నెం. 1' షూటింగు డిశంబరు 2 న ప్రసాద్ స్టూడియోలో ప్రారంభమైంది. ఉదయం గం. 8 లకు జరిగిన ప్రారంభోత్సవానికి వెండితెర ప్రముఖులందరూ విచ్చేసి, నిర్మాత సునీల్ చౌదరికి ఆశీస్సు లందచేశారు. నవయుగ శ్రీనివాసరావు, ఎం. పి. స్విచ్ ఆన్ చెయ్యగా, అనసూయ వేణుగోపాల్ క్లాప్ కొట్టారు. బి. ఎస్. నారాయణ దర్శకుడు.

● జగపతి ఆర్ట్ పిక్చర్స్ తమ 9 వ చిత్రాన్ని ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్నారు. చిత్రానికి 'బంగారు బాబు' అని పేరు. వి. బి. రాజేంద్రప్రసాద్ దర్శకుడు. వాణిశ్రీ, అక్కినేని నాయికా నాయకులు.

● ఫల్గుణావారి 'జగత్ జెంత్రీలు' డిసెంబరు 30 న లక్ష్మీ ఫిలింస్ ద్వారా విడుదల అవుతుంది. లక్ష్మీ దీపక్ దర్శకుడు.

● ఉక్రాంతి సమర్పించు త్రిమూర్తి ప్రొడక్షన్స్‌వారి రంగుల చిత్రం షూటింగ్ నిర్విరామంగా లొకేషన్‌లో జరుగుతున్నది. ఇంతవరకు 10 రీళ్ళు పూర్తి అయింది. దర్శకుడు: పి. లక్ష్మీదీపక్, నిర్మాతలు: పి. భాస్కర్, జి. సాంబశివరావు.

## జగత్ జెంత్రీలు

రాజా రఘువీరసింహానికి ఒక్కగా నొక్క కుమార్తె వుంది. ఆమె చని పోయిందన్న శోకవార్త రఘువీరసింహాని చెవిన బడింది. తన ఆస్తిని ప్రభుత్వ సంక్షేమనిధికి ఇవ్వడానికై రైలులో హైద్రాబాదుకి బయల్దేరుతాడు. ఆ వుదంతం జగత్‌జెంత్రి ఝాన్సీకి తెలిసింది. రాజాను తప్పించి, ఆస్తిని కొట్టెయ్యడానికి ప్లాను వేసింది. రాజాను రక్షించి ప్రభుత్వానికి అప్పగించవలసిన బాధ్యత సి. ఐ. డి. భారత్‌పై బడింది. ఈ సి. ఐ. డి. ఆఫీసర్ని బంధించాలని ఝాన్సీ (మారుపేరుతో) ఒక డ్యాన్సు ప్రోగ్రామును, ఏర్పాటు చేయించి, భారత్‌ను ఆహ్వానిస్తుంది. భారత్‌కు ఝాన్సీ ఎత్తుగడ తెలిసికూడా, ఈ సందర్భంగా ఆమె ముఠా ఆచూకీని పసిగట్ట వచ్చు అని భావించి, డ్యాన్సు పార్టీకి వచ్చాడు. భారత్‌ను చూడగానే, ఝాన్సీకి సమరోత్సాహం కలిగింది. అతడ్ని కవ్విస్తూ, మత్తెక్కించే వలపు చూపులు విసురుతూ, ఆటపాటలతో భారత్‌ని ఆకర్షించడానికి ప్రయత్నించింది. ఆమె ఏమని పాడిందో తెలుసా?

"పీరియా, టాటా!
కన్నులనిండా కైపులుంటే నోఫియర్
మై డియర్, కంనియర్
వెన్నెలకన్నా వెచ్చనిహాయి ఐయాం హియర్."

అంటూ పాడింది. 'కట్' అన్నాడు దర్శకుడు లక్ష్మీదీపక్. ఈ హుషారయిన సన్నివేశం ఫల్గుణావారి 'జగత్ జెంత్రీలు' క్రయిమ్ థ్రిల్లర్ లో కనిపిస్తుంది. భారత్‌గా శోభన్‌బాబు, ఝాన్సీగా వాణిశ్రీ నటించారు.

చక్కని కథాగమనంతో, హుషారయిన సన్నివేశాలతో, మధుర సంగీతంతో, సంభ్రమాశ్చర్యాలను గొలిపే దృశ్యాలతో సర్వాంగ సుందరంగా తయారయిన 'జగత్ జెంత్రీలు' చిత్రాన్ని ఏకామ్రేశ్వరరావు, రాఘవులు నిర్మించారు. లక్ష్మీఫిలింస్ విడుదల.

# సినిమా

## డాక్టర్ కథకి ఉత్తమ బహుమతి

'పచ్చని సంసారం' కథని మద్రాసు ఫిలిమ్ ఫాన్సు అసోసియేషన్ ఉత్తమంగా నిర్ణయించి, కథకుడు ప్రభాకరరెడ్డికి అవార్డు నిచ్చింది. ఆయన వ్రాసిన రెండవ కథయే 'పండంటి కాపురం'

'మొదటి కథ కన్నా రెండవది వెయ్యి రెట్లు బాగా వచ్చింది' అన్నారు నటుడు, కథకుడు, డాక్టరు అయిన ప్రభాకరరెడ్డి. 'గుడ్ లక్ ఎగెయిన్' అంటూ, మిగతా వివరాలను అడిగాను. 'పండంటి కాపురం' చిత్రాన్ని జయప్రద పిక్చర్స్ బ్యానర్ లో నిర్మిస్తున్నట్టు చెప్పారు. రచన ముద్దిపట్ల సూరి, అకుర్తి నరసింహామూర్తి; సంగీతాన్ని కోదండపాణి, కళను బి. ఎన్. క్రిష్ణ నిర్వహించే యీ సముజ్వల సాంఘికానికి లక్ష్మీదీపక్ దర్శకుడు.

'పచ్చని సంసారం' చిత్రం విడుదల కాగానే, లక్ష్మీదీపక్ ట్యాలెంటుకి మంచి గుర్తింపు వచ్చింది. అతగాడిలోని మెరిట్ ను ప్రభకరరెడ్డి యేనాడో పసిగట్టి, తన మొదటి చిత్రాన్ని అతడిచే డైరెక్ట్ చేయించి, పరిశ్రమకు ఒక మంచి టెక్నిషియన్ని చూపించాడు. కుటుంబగాథా చిత్రాలను చిత్రీకరించడంలో తనకొక ప్రత్యేక బాణీ వుందని నిరూపించిన దీపక్, 'పండంటి కాపురం' ద్వారా మరింత పాపులర్ అవడానికి ప్రయత్నించాలి.

'పండంటి కాపురం' చిత్రంలో ఎస్వీ రంగారావు, గుమ్మడి, ప్రభాకరరెడ్డి, క్రిష్ణ నలుగురు అన్నదమ్ములుగా నటిస్తారు. స్త్రీ వేషధారణకు (అంటే నాయికా పాత్ర పోషణకి) విజయనిర్మలను ఎన్నుకున్నారు. షూటింగు 1972 ఏప్రిల్ 22న ప్రారంభమవుతుంది.

## రాము, రాధల రంగుల కల!

ఒక వూర్లో ఒక కొంటెపిల్ల వుంది. ఆమె పేరు రాధ. ఆమె ఒక యువకుడ్ని ప్రేమించింది. అతగాడి పేరు రాము. బాకు లాంటివాడు; కష్టించి ఎక్కువ పంట పండించే కర్షకుడు. రాము, రాధల ప్రేమ దినదిన ప్రవర్ధమానమైంది. ఒకర్ని విడచి మరొకరు క్షణమయినా వుండలేనంతగా ప్రేమించుకున్నారు.



'కొండ రాణి'లో జ్యోతిలక్ష్మి
'ఒక నృత్య భంగిమా?'

రాము తన ప్రియురాలిని, రాధ తన ప్రియుడ్ని వూహాప్రపంచంలో కలుసుకున్నారు. ఇద్దరి భావాలు, కళ్ళు, హృదయాలు కలిసాయి. ఆనందోత్సాహంతో రాధ పాడసాగింది. ఏమని?

'మనసే పొంగెను ఈవేళ
వలపే పండెను ఈవేళ
తారల దారుల వెన్నెలవాడల
తనువే వూగెను వుయ్యాల' అంటూ

రాధ పాడుతుంటే, రాము అందుకుంటాడు. ఎలాగో తెలుసా?

'విరిసిన నీవే నను చేరగా
సిగ్గులు నాలో చిగురించగా' అంటూ

రాధ చెక్కిలిపై చక్కిలిగింతలు పెడతాడు. 'కట్' అన్నారు దర్శకుడు తాతినేని రామారావు. ఈ మధురాతి మధురమైన శృంగార ఘట్టం రంగురంగుల స్వప్నం దృశ్యంగా నవభారత్ మూవీస్ 'రైతుకుటుంబం'లో కనిపిస్తుంది. పి. వి. సుబ్బారావు, పి ఎస్. ప్రకాశరావులు నిర్మాతగా, ఏ. పూర్ణచంద్రరావు నిర్వహణలో సర్వజన రంజకంగా నిర్మితమైన 'రైతుకుటుంబం' చిత్రంలో చలపతిరావు సంగీతం వీనుల విందుగా ఉంటుందని పరిశ్రమలో ఏనోట నయినా వినవచ్చు.

## అందర్నీ ఆకర్షించే తార

ఇప్పుడు నిర్మాణంలో వున్న కలర్ చిత్రాల్లో చాల భాగం వాణిశ్రీ నాయికగా నటిస్తున్నవిగా కనిపిస్తున్నాయి. ఈమె నటించిన మొదటి కలర్ చిత్రం 'ఇద్దరమ్మాయిలు'. దాని తర్వాత 'దసరా బుల్లోడు'; తర్వాతది 'ప్రేమనగర్' పై నుదహరించిన మూడు చిత్రాలు విజయవంతంగా ప్రదర్శింపబడ్డాయి. మూడింటిలోనూ నటసామ్రాట్ నాయకుడు గావడం మరొక విశేషం.

రవీంద్రా ఆర్ట్ పిక్చర్స్, పద్మశ్రీ పిక్చర్స్, సురేష్ మూవీస్, అన్నపూర్ణా ఆర్ట్ పిక్చర్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న సాంఘికాల్లో అక్కినేనితో వాణిశ్రీ నాయికగా నటిస్తూ వుంది. తనకు వచ్చే ప్రతి పాత్రకి పరిపూర్ణ న్యాయం చెయ్యగలదు అన్న నమ్మకం పరిశ్రమకు ఎంత వుందో, ప్రజలకి అంతకి రెండింతలు వుంది. 'ప్రేమనగర్'లోని వాణిశ్రీ నటన్ను మెచ్చుకోని వాళ్లు లేరంటే అతిశయోక్తి కాదు. పిల్లలు, విద్యార్థులు, మహిళలు, విద్యార్థినులు, పండిత పామరులు అందరి అభిమానాన్ని చూరగొన్న ఏకైక నటీమణి వాణిశ్రీ అనవచ్చు.

## కృష్ణ సమర్పించు మంచివాళ్లకు మంచివాడు

శ్రీ వెంకటేశ్వర ఆర్ట్ పిక్చర్స్ వారి పూర్తి రంగుల చిత్రం 'మంచివాళ్లకు మంచివాడు' షూటింగ్ మహాబలిపురంలోని 'సిల్వర్ శాండ్స్' హోటల్‌లో నవంబర్ 27 ఉదయం 11 గం. లకు ప్రారంభమయింది.

కాశ్మీర్, కులూ లోయల్లో అవుట్‌డోర్ షూటింగ్ జరుపుకోబోతున్న యీ చిత్రం- మోసగాళ్లకు మోసగాడు తర్వాత కృష్ణ సమర్పిస్తున్న మరొక సాహసిక చిత్రం! కృష్ణ, విజయనిర్మల, సత్యనారా

[illegible] కె. జగ్గారావు, ప్రభాకరరెడ్డి, ఆనందమోహన్, భీమరాజు రామకృష్ణ (మిస్టర్ మద్రాస్) మున్నగువారు ముఖ్య భూమికలను పోషిస్తున్నారు.

రచన: పాలగుమ్మి పద్మరాజు, సంగీతం: సత్యం, ఆర్ట్: కె. రామలింగం, కూర్పు: కోటగిరి గోపాలరావు, ఫోటోగ్రఫీ: వి. యస్. ఆర్. స్వామి, దర్శకత్వం: కె. యస్. ఆర్. దాస్, నిర్మాత: యస్. భావనారాయణ.

## భవిష్యత్తులో వెండి తెర విశ్వవిద్యాలయాలు !

వాషింగ్టన్‌లో అమెరికన్ విద్యామండలి 54 వ వార్షిక సమావేశం జరిగింది. ఈ సభకు 1625 విద్యావేత్తలు వచ్చారు.

టేప్‌రికార్డుల కేసెట్స్ సాయంతో ఇంట్లోనే కూర్చుని చదువుకునే 'టెలివిజన్ విశ్వవిద్యాలయం' ప్రతిపాదన మొదటిది; విశ్రాంతి వేళల్లో పార్ట్‌టైమ్ పద్ధతిన చదువుకునే బాపతు విశ్వవిద్యాలయం రెండవది.

సెకండరీ పాఠశాలనుండి పట్టభద్రుడైనా, కాకపోయినా, ప్రతి వ్యక్తీ ఒక సంవత్సరంపాటు విధిగా కళాశాలకు హాజరు కావాలి. ఆ మీదట మిగతా చదువును యింట్లోనే కొనసాగించవచ్చు. 'టెలివిజన్ విశ్వవిద్యాలయాన్ని' జాతీయ సంస్థగా యేర్పాటు చెయ్యడంద్వారా వున్నత విద్యావ్యవస్థను పునర్వ్యవస్థీకరించాలి' అని ప్రొఫెసర్ అలెగ్జాండర్ ఎం. మూడ్

## సినిమా

(కాలిఫోర్నియా) సూచించారు.

'ఈ కొత్త విధానం ఎటువంటి విద్యను, ఎటువంటి వ్యక్తిని తయారు చేస్తుంది? గురుపరంగా కాకుండా విద్యను మళ్ళీ అనిబద్ధ, ఆటవిక బాధ్యతగా చేసినదానివల్ల ఒరిగేదేమిటి?' అంటూ డేవిడ్ మాత్యూస్ వాదించారు. (అలబామా విశ్వవిద్యాలయం)

వాద ప్రతివాదనలు జరిగిన తర్వాత, సమావేశమయిన 1625 సభ్యులు పై చర్చనీయాంశానికి సులభ సమాధానాలు లేవని అంగీకరించారు.

## యువదర్శకుని ఉద్దేశాలు !

ప్రముఖ దర్శకులు ఆదుర్తి సుబ్బారావు, వి. మధుసూదనరావులవద్ద శుశ్రూష చేస్తే వృథాపోదు అని నిరూపించాడు యువ దర్శకుడు పి. చంద్రశేఖరరెడ్డి. గత వారం ఆయన్ని 'మానవుడు—దానవుడు' సెట్లో కలిసినప్పుడు, నాకున్న కొన్ని సందేహాలను నివృత్తి చేసుకున్నాను.

'సినిమా పరిశ్రమను జూదం అంటే నేను ఒప్పుకోను; చక్కటి ప్లాను, ఆర్థిక స్తోమత వుండి, క్రమశిక్షణతో చేస్తే చాలా వ్యాపారాలకంటె లాభసాటిదని, మంచి చిత్రాలను ప్రేక్షకులు ఎప్పుడూ ఆదరిస్తారని, సాంప్రదాయాలకు భిన్నంగా కాకుండా కొంత కొత్తదనం వుంటే మరింత ఆదరణ లభిస్తుందని' చెప్పారు చంద్రశేఖరరెడ్డి. 'అసలు కథతో మిళితమైనప్పుడే కామెడీ రాణిస్తుంది; లేకపోతే ఎంత కడుపుబ్బ నవ్వించే సన్నివేశమయినా కథను ఆపివేసినట్టు వుంటుంది' అంటారు రెడ్డిగారు.

ఒక చిత్రం నిడివి 15 వేల అడుగులు దాటకుండా వుండడం మంచిదని, చిత్రానికి 6 నుండి 8 పాటలవరకు వుండవచ్చునని అభిప్రాయపడుతున్నారు, చంద్రశేఖరరెడ్డి. దర్శక నిర్మాతల సంబంధం సంసారంలో భార్యా భర్తల దాంపత్యంలాగ వుంటేనే చిత్రం బాగా వస్తుందనే నమ్మకం తన కుందని చెప్పారు చంద్రశేఖరరెడ్డి.

'మన ప్రజలకు ఎలాంటి కథలంటే యిష్టమో చెప్పగలరా?' అన్న నా ప్రశ్నకు ఆయన యిచ్చిన జవాబు యిది: క్రయిమ్ అండ్ సెక్సు ఎక్కువ వున్న చిత్రాలకు తాత్కాలిక ఆదరణ లభించవచ్చు. చక్కటి సెంటిమెంట్సుగల కుటుంబగాథా చిత్రాలకే ప్రజల ఆదరం వుంటుంది అనడం నిర్వివాదాంశం, అన్నారు. భవిష్యత్తులో సినిమా పరిశ్రమ మూడు పువ్వులు, ఆరు కాయలుగా వర్ధిల్లగలదని నేను ఆశిస్తున్నాను, అన్నారు పి. సి. రెడ్డి.

## మీకు తెలుసా?

నటసామ్రాట్ నాగేశ్వరరావు అమ్మగారి వయస్సు 88 సంవత్సరాలు. ఇంతవరకు ఆమెకి ఒక పన్ను కూడా వూడలేదట.

ప్రముఖ నటి వాణిశ్రీ షూటింగు విరామ సమయాల్లో కథానికలు వ్రాస్తుంది.

నటుడు బాలయ్య, డిస్ట్రిబ్యూటరు చంద్రశేఖరరావు, దర్శకుడు విశ్వనాద్ పేర్ల రాశికి అనుగుణ్యంగా జ్యోతిష్యుడు పెట్టిన పేరే అమృతా ఫిలింస్

రాజేష్ మూవీస్‌లో నటుడు కాంతారావు కుమారుడు చి. ప్రతాప్ భాగస్తుడు.

'తాసిల్దారుగారి అమ్మాయి' చిత్రం పెద్ద హీరో చిత్రం అంత వసూలు చేస్తోంది.

తెలుగు నవలలను చిత్రంగా నిర్మిస్తే, ప్రేక్షకుల ఆదరణ లభిస్తుంది అన్న ఆశాభావం యిప్పుడిప్పుడే పొడసూపింది.



'జగత్ జంత్రీలు' ప్రభాకరరెడ్డి, వాణిశ్రీ.

'షాట్ డివిజన్' అంటే ఏమిటి అని ప్రశ్నించాను. 'సినుకు తగినట్లు, తదనుగుణంగా మాటలు వ్రాసి ఉన్నారు. దానిని ప్రేక్షకులకు సులభంగా అర్థమయ్యేలా, ఎలా చూపిస్తే బాగుంటుందోనన్న విషయం ముందుగా ఆలోచించుకొని నిర్ణయించే పద్ధతిని 'షాట్ డివిజన్' అంటారని చెప్పారు.

నేను చంద్రశేఖరరెడ్డిని సెట్సుపై పనిచేస్తున్నప్పుడు చూసినప్పుడల్లా యీ యువకుడికి ఉజ్వల భవిష్యత్తు వుంటుంది అన్న అభిప్రాయం కలుగుతూ వుంటుంది. పనిపైన శ్రద్ధ, కథపైన గమనం, కొత్తదనంకోసం వెతికే స్వభావం, చెప్పదల్చు



దర్శకుడు చంద్రశేఖరరెడ్డి.

కున్న అంశాన్ని సూటిగా చెప్పే సామర్థ్యం, స్ఫురణశక్తి విశేషణాలుగా గొన్న చంద్రశేఖరరెడ్డి వర్తమానంలో ఉత్తమ దర్శకుడు కాగలడనే నమ్మకం పరిశ్రమకు ఏర్పడింది? మరి మీరు కూడా వో. కే. అంటారనుకుంటా!

ప్రస్తుతం చంద్రశేఖరరెడ్డి ఉప్ప శ్రీ చిన్నపరెడ్డి నిర్మిస్తున్న 'మానవుడు—దానవుడు', నందినీ పిలిమ్స్ వారి సాంఘికం, త్రివేణీ ప్రొడక్షన్స్ సాంఘికానికి దర్శకత్వం నెరపుతున్నారు. ఒక దాంట్లో శోభన్—శారద; రెండోదాంట్లో వాణిశ్రీ—కృష్ణ; మూడవదాంట్లో ఎన్టీఆర్ — అంజలీదేవి ముఖ్య పాత్రధారులు.

—శ్రీనివాస్ ●

# పశ్చిమదేశాలలో ఘంటసాల సాంస్కృతికయాత్ర! అంజలీదేవికి 'నటీశిరోమణి' బిరుదు ప్రదానం!





నాలుగు వారాలపాటు పశ్చిమ దేశాలలో సాంస్కృతిక యాత్ర వెళ్ళిన మన ప్రముఖ నేపథ్య గాయకుడు, సంగీత దర్శకుడు అయిన శ్రీ ఘంటసాల వెంకటేశ్వరరావు నవంబరు 6వ తేదీన మద్రాసుకు తిరిగి వచ్చారు. ఆ సందర్భంగా స్థానిక టి. నగర్ నాగేశ్వరరావు రోడ్‌లో గల సుగుణవిహార్‌లో పత్రికా ప్రతినిధులకు ప్రత్యేకంగా ఆయన నవంబరు 18 న విందు యిచ్చారు.

'నా యూరప్, యునైటెడ్ స్టేట్స్ యాత్ర ఎంతో ఉత్సాహంగా సాగింది. నన్నెంతో ఉత్తేజపరిచింది. ఇవాళ మీ అందరిమధ్యా నా ఆనందాన్ని, అనుభవాలన్నీ పంచుకోగలుగుతున్నందుకు చెప్పలేనంత సంతోషంగా ఉన్నది' అన్నారు ఘంటసాల.

ఈ యాత్రలో ఆయన ఫ్రాంక్‌ఫర్ట్, లండన్, న్యూయార్కు, వాషింగ్టన్, లాస్ ఏంజిలిస్, శాన్‌ఫ్రాన్సిస్కో, డెట్రాయిట్, చికాగో, టొరంటో, బోస్టన్, పారిస్, కువాయిట్ నగరాలను దర్శించివచ్చారు. శ్రీ ఘంటసాలతో పాటు ఆయన ఆర్కెస్ట్రా సభ్యులు మరి తొమ్మిదిమంది వెళ్ళారు. 'యునైటెడ్‌స్టేట్స్‌కి ఒక భారతీయ సంగీత విద్వాంసుడు ఇంత పెద్ద బృందంతో వెళ్ళటం ఇదే మొదటిసారి అనుకుంటాను'... అన్నారాయన.

విదేశాలకు వెళ్ళి అక్కడ ప్రేక్షకులకు మన భారతీయ సంగీతాన్ని వినిపించాలనే నా చిరకాల వాంఛ యీనాడు నెరవేరింది. మీ అందరిముందు నా అనుభవాలను చెప్పుకుని ఆనందించగలిగే అవకాశం కలిగినందుకు గర్వపడుతున్నాను. మీ అందరికీ నా హృదయపూర్వక కృతజ్ఞతాభివందనాలు అని కూడా చెప్పారు శ్రీ ఘంటసాల.

## లండన్‌లో సూర్యకుమారి స్వాగతం

ఘంటసాల తమ పర్యటనలో లండన్‌కి వెళ్ళినప్పుడు— అక్కడే స్థిరపడిపోయిన సుప్రసిద్ధ గాయని టంగుటూరి సూర్యకుమారి ఆయనకు ఘనమైన స్వాగతం యిచ్చారు. ఘంటసాలకీ, సూర్యకుమారికీ మిత్రత్వం ఉన్నది. లండన్‌లో ఆమె డాన్స్ స్కూల్ నిర్వహిస్తున్నారు. భారతీయ సంగీతం పట్ల ఎంతో శ్రద్ధ తీసుకుని — లండన్ లోగల భారత, పాశ్చాత్య ప్రేక్షకులలో భక్తిని అభిరుచి పెంపొందించిన శ్రీమతి టంగుటూరి సూర్యకుమారి కృషి— ఘంటసాలగారిని ఎంతో టచ్ చేసిందట! ఈ విషయం కూడా ఆయన పర్యటనానుభవాలలో వెల్లడి చేశారు.

## కాకినాడలో కల్చరల్ ఫెడరేషన్!



అందరి క్షేమంకై సంఘాలు కలిసి కాకినాడలో ఒక సంస్థగా ఏర్పడ్డాయి. ఆ సంస్థ పేరు 'కల్చరల్ ఫెడరేషన్' నవంబరు 14 వ తేదీన ఆ సంస్థవారు శ్రీమతి అంజలీదేవికి సన్మానం చేసి, 'నటీశిరోమణి' బిరుదు ప్రదానం చేశారు. కల్చరల్ ఫెడరేషన్ తరఫున తూర్పు గోదావరిజిల్లా కలెక్టరు శ్రీ ఎల్. వూలాకొండయ్య ఈ బిరుదును యిచ్చారు.

కల్చరల్ ఫెడరేషన్ నాటకాల పోటీని నిర్వహించింది. శ్రీమతి అంజలీదేవి వాటిలో ఎన్నికయిన వారికి బహుమతులను పంచిపెట్టారు.

'కనకపుష్యరాగం' అనే నాటకానికి మొదటి బహుమతి వచ్చింది. ఈ నాటకం చాలా బాగున్నది. చాలాకాలం తర్వాత ఒక మంచి నాటకం చూశాను' అన్నారు అంజలీదేవి పాల్గొంటూ.

—కిందటివారం నాతో ముచ్చటిస్తూ.

—మోహన్ కుమార్

## మల్లెలు — ఎర్రగులాబీలు

రచన: యర్రం చంద్రశేఖరం, పేజీలు: 340, వెల: 6—50., ప్రతులకు: యర్రం చంద్రశేఖరం, ఇం. నెం. 1—3—8, మామిళ్ళగూడెం, ఖమ్మం. ఆంధ్రప్రదేష్.

ప్రభాకరమనే జడపదార్థంలోని మూర్ఖత్వాన్ని తొలగించటానికి క్షణక్షణం ఆరాటపడిన శ్రేయోభిలాషిణిగ, రాతివంటి అతనిలో రసమయావేశం కల్గించిన రచయిత్రి, (తమ) జీవితాల్నే కథలుగా వ్రాసి చదివించి పరివర్తన కల్గించిన జ్యోత్స్నగ, మల్లె పూవులాంటి మంచి మనసుగల మగువ శారద ఈ నవలలో నాయిక. మంచి హృదయంతో మనుగడ సాగించవచ్చన్న సూక్తికి ఈ నవలలోని శారదపాత్ర తార్కాణం.

శాంత చుట్టూ కథ పరిభ్రమిస్తున్నా నీరజ పాటకుల్ని మరువనీయదు. సుందరం ప్రేమ కోసం పోటీపడిన ఈ రెండు పాత్రల భావస్వభావాల వైరుధ్యాన్ని పాటకుల కవగతమయేలా మలచటంలో రచయిత శ్రమ ప్రశంసనీయం.

రామం పాత్ర మనసుల్ని ఆక్రమించుకుంటుంది. పెద్ద లందరి మధ్యా పిన్నవాడైన ఈ రామం గంభీర మూర్తిగా యువతరంలోని నవీన భావాల మేరువుగా అన్నింటా తానై వ్యవహార దక్షత వహించటం చదివేందుకింపుగా వుంటుంది. స్వార్థానికి—నిస్వార్థానికి—చదువుకి—సంస్కారానికి, మధ్యనున్న వైవిధ్యం ప్రయోజనాత్మకముగ నున్నది. ఈ ప్రయోగంలో రచయిత కృతకృత్యులయ్యారనటానికి సందేహం లేదు. పాటకులకు కావలసిన రుచులన్నీ పంచిపెట్ట గలిగారు రచయిత. ముందు ముందు మరింత ప్రయోజనాత్మకమైన రచనలు రచయిత నుండి ధారావాహికంగా ఆశించవచ్చు. ఆంధ్రసచిత్రవారపత్రికలో ప్రచురించబడి పాటకుల అభిమానాన్ని పొందిన నవల యిది..

—కృష్ణ

## విధి విన్యాసాలు

విధివిన్యాసాలు: కావిలిపాటి విజయలక్ష్మి—యం. శేషాచలం అండ్ కో., మచిలీపట్నం, పేజీలు: 216, వెల: రు. 2—50.

నిజజీవితంలో వ్యక్తి ఎలాంటి పరిస్థితులమధ్య వుంటున్నది, ఏ విధమైన వాతావరణంలో పెరుగుతున్నది, నం ఱజీవితం, నాగరిక జీవితం వీటికితోడు వైవిధ్య వైరుధ్యములలో కూడి సహస్రవిధాలుగా విజృంభిస్తున్న సమకాలీన సామాజిక సమాచారాలు కొంతమేర తెలుసుకోవచ్చును.

ఈ పుస్తకం చదువుతూ వుంటే గజిబిజిగా వుండదు. సాఫీగా నడుస్తుంది.

తహసీల్దారిగారి అమ్మాయి మధుమతి పక్క ఇంటి బామ్మగారి మనుమణ్ణి పెళ్ళి చేసుకొనుట— 4 నెలల పిల్లవాడైన వాసును వదిలిపెట్టి భువనవడ దేశాంతరాలు వెళ్ళుట— వాసు పెద్ద చదువులు చదువుకోవలెననే ఆశతో వుండుట— వాసు మేన మామ ఎగతాళిగా కండక్టరు కుమారునికి పెద్ద చదువులు కూడానా అని చెప్పుట— వాసు తండ్రి

# పుస్తకాలు

ఇల్లు వదలిపోయినప్పుడు కండక్టరుగా చేరి నెమ్మదిగా పెద్ద వ్యాపారస్తుడయి భాగ్యవంతుడగుట— వాసు తండ్రి సంగతి తెలిసికొని కాలేజీలో చదువుకు, జీవితానికి సహాయం పొందుట— వాసుతండ్రి సహాయం తల్లికి తెలియనీయకపోవుట— పెద్ద ఉద్యోగం సంపాదించుట— ప్రసాదరావు అనగా తండ్రి వివాహం చెయ్యవలెనని ఆలోచిస్తూ వుంటే అంతా కలిసి వున్నట్లయితేనే పెళ్లికి అంగీకరిస్తానని మొండి పట్టుపట్టుట— తండ్రి అంగీకారము—చివరకు అందరూ కలసికొనుట.

కథలో విసుగులేదు. ఏదో నడుస్తుంది. గొప్పవని తనము లేకపోయినా కాలక్షేపానికి పుస్తకం బాగానే వుంటుంది.

—'పునర్వసు'

## సంస్కృత పాఠమాల

మూలం: శ్రీ శ్రీపాద దామోదర సాత్వలేకర్, అనువాదం: శ్రీగడ్డమణుగు మోహనరావు, శ్రీ దోర్బల విశ్వనాథశర్మ, 16 భా. 60 పుటలు. 17 భా. 55 పుటలు. 18 భా. 60 పుటలు, ఒక్కొక్క దానివెల రు. 1—25. ప్రకాశకులు సంస్కృతభాషా సేవామండలి, మహబూబాబాదు, వరంగల్లు జిల్లా.

స్వయంగా సంస్కృత భాషను అభ్యసించడానికి అనుకూలంగా కూర్చబడిన ఈ పాటమాల భాగాలు 15 ఇదివరకే ఆంధ్రులకు పరిచితాలు. వాటిని సక్రమంగా చదివిన తర్వాత చదివి, అభ్యసిస్తే వీటి ఉపయోగం తెలుస్తుంది. ఇదివరకు 13—14—15 భాగాలలో ధాతువులలో సులభమైన 1—2—4—6—10 గణాలకు సంబంధించిన రూపాల వివేచన ఉన్నది. ఇందులోని 16వ భాగంలో మిగిలిన అయిదు గణాల రూప నిష్పత్తి క్రమం వివరింపబడింది. దీనితో ధాతురూపాలన్నీ బోధపడగలవు.

సంస్కృతంలో తక్కిన వాటికంటే ధాతువివేకం క్లిష్టతరమైనది. అందువల్ల తరమగా మననం చెయ్యడం అవసరం. అందుకని 17—వ భాగంలో —ఇదివరకు చెప్పబడిన ధాతువుల పునఃపరిశీలన సంగ్రహంగానూ, సులభంగానూ కూర్చబడింది.

18—వ భాగంలో ధాతువుల నుండి ఏర్పడే నామ వాచకములను— అంటే కృదంతాలనుగూర్చిన విషయం ఉన్నది. కృత్తులలో ముఖ్యాలైన తవ్య, అనీయ, య, అక, తృ, అవ, అ, మాన, ఇష్ణు, స్ను, ను, త, న, తవత్ అనేవి చివరవచ్చే నామాలను గురించి రామాయణ భారతాలలోంచి ఉదాహరణలిస్తూ చెప్పబడినవి. వీటిని అభ్యసిస్తే సంస్కృతంలో ధారాళంగా మాటలాడుటకూ, చక్కని వ్యాసాలు వ్రాయుటకూ వీలు కలుగుతుంది.

తక్కిన భాగాలకువలె వీటికిన్నీ తప్పొప్పుల పట్టికలు చేర్చబడినవి.

—అంగీరస

## ముముక్షువు

రచయిత: రామకటాక్షి, ప్రతులకు: సుమిత్రా పబ్లికేషన్స్, నాగార్జున ప్రింటర్స్, చిత్తూరు. క్రౌను 85 పుటలు. వెల: రెండురూపాయలు.

## స్వాహా సుస్తుము

రచయిత: గాజులవీరయ్య ఎం. ఏ. ప్రతులకు: రచయిత, విజయనగరకళాశాల, హొసపేట, బళ్ళారిజిల్లా. క్రౌను పుటలు 68, వెల: రు 1·25 పైసలు.

ఈ రెండు ఖండకావ్యాలలోను మొదటి దానిలో కథ వాసవదత్త ఉపగుప్తులకు సంబంధించినది. ఉపగుప్తుడు బవుద్ధ భిక్షువు. వాసవదత్త వేశ్య. ఆమె అతని అందచందాలు చూచి ప్రేమిస్తుంది. కాని ఆ భిక్షువు ఆమె ప్రేమ తిరస్కరిస్తాడు. కాని ఆమె రాజదండనకు పాల్పడి దిక్కుమొక్కు లేక అల్లాడు తున్నప్పుడు సంరక్షించి బవుద్ధధర్మం కటాక్షిస్తాడు.

ఈ కథ ప్రసిద్ధమైనది. రవీంద్రుడు ఇదేకథ ఒక కథా కావ్యంగా రూపొందించాడు. రామకటాక్షి గారిది కేవలం సాంప్రదాయ పద్ధతిలో చంపకమాలాది వృత్తాలలో రచించారు. దీనిలో ప్రబంధాలలో లాగే ఋతువర్ణనలు, విరహాది వర్ణనలు మొదలయినవి వస్తాయి. ఈ కావ్యంలోని కథా ధోరణినిబట్టి చూస్తే శాంత శృంగారాలకు పొందిక అంతంత మాత్రంగానే ఉన్నదనిపిస్తుంది. పైగా పెద్దనాదుల అనుకరణలు అక్కడక్కడ కనిపిస్తున్నాయి. అయితే రచయిత 17వ ఏట రచించిన కావ్యమిది. సాంప్రదాయ కావ్య రచనకవసరమయిన భాషా ఛందస్సుల పటిమ ఈకవికున్నది. శైలిలో మాధుర్య మున్నది.

ఇంత చిన్న ప్రాయంలోనే ఈ విధంగా రచించ గలిగిన ఈ కవి క్రమక్రమంగా పరిణతులయిన మంచి కవిగా పేరు కెక్కగలరని ముముక్షువు స్ఫురింపజేస్తున్నది.

ఇక రెండవ ఖండకావ్యం స్వాహా సుస్తుము. ఇదే పేరున్న మాథ్యూ ఆర్నాల్డు కవి ఆంగ్ల కావ్యానికి స్వేచ్ఛానుసరణమని రచయిత పీటికలో పేర్కొన్నారు. ఇది కూడా సాంప్రదాయిక పద్ధతిలో వృత్తాలలో నడిచిన కావ్యమే. మాథ్యూ ఆర్నాల్డు ఆంగ్ల కావ్యం ధోరణిలో రచించాలనుకున్నప్పుడు మాత్రా ఛందస్సులేవయినా చేపట్ట ఉండవలసినది. అదీగాక ఈ కావ్యం చదువుతున్నప్పుడు ఏదో సామాన్యమయిన తెనుగు కావ్య మనిపిస్తుంది గాని, మాథ్యూ ఆర్నాల్డు ఆంగ్ల కావ్య పటిమగాని కవితాశక్తిగాని దీనిలో అంతగా కానరాదు.

—శాస్త్రి

## ఉజ్జీవన్

సచిత్ర మాసపత్రిక. సంపాదకుడు కె. రామగోపాలరావు. అక్టోబరు ప్రారంభ సంచికలో మంచి వ్యాసాలూ, కథలూ, గేయాలూ, వున్నాయి. విడి ప్రతి రూపాయి. సంవత్సర చందా పదిరూపాయలు. లలితాప్రెస్. ఖైరతాబాద్, హైదరాబాద్—4.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press; 6 & 7, Thambu Chetty Street, Madras-1; and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada-3

మగువ—
మనోహరమైనది
అయినా
నిరుత్సాహపరచేది.
ఇంతలో నవ్వుల
వెన్నెల, ఇంతలో
కన్నీటి వెల్లువ. అనేక
మనోభావాలుగల
మగువలే 'మెఫ్రిన్'కు
ప్రేరేపకాలు!




# మెఫ్రిన్

'మెఫ్రిన్' యంగీ ధరించిన మగువ
అందరి దృష్టిని ఆకర్షిస్తుంది.

'మెఫ్రిన్' పాలియెస్టరు కలిపిన [illegible]

ఇంకా: ఆధునికమైన,
అద్భుతమైన, రంగులలో [illegible]

**మఫత్‌లాల్
గ్రూప్**

AIYARS-M 317 TL


ASOKA
REGD
AMLA
BRILLIANTINE